

चन्दामामा
चांदोबा
அம்புலிமாமா
చందమామ
CHANDAMAMA

కలలు అంత గొప్పవిగావున్నవాళ్ళ జీన్స్,
చిన్నవిగా వుంటాయనే ప్రశ్నే లేదు.



మీ జూనియర్ యొక్క కలలు ఆకాశాన్నంటుతుంటే, తన జీన్స్ చిన్నవిగా ఎందుకుండాలి ? అందుకే అందిస్తున్నాం రఫ్ అండ్ టఫ్ జూనియర్ జీన్స్. అంటే అరవింద్ డెనిమ్ బట్ట, (132 సెం.మీ. ఎత్తుదాకాగల వారికోసం) గట్టి జిప్, బటన్స్, లేబుల్ మరియు రివెట్స్. మీ అబ్బాయి పొడుగు, ఎదుగుదల ప్రకారంగా, కాస్త జాగావిడిచి కుట్టించండి. చూడండిక, మీవాడి కలలు ఎలా దూసుకుపోతాయో !




A QUALITY PRODUCT FROM ARVIND MILLS

JUNIOR

కుట్టడానికోసం-తయారుగావున్న జీన్స్

Trikaya Grey AML 6 96 TEL



# చందమామ

మార్చ్ 1997





విడిప్రతి : **6.00**

సంవత్సర చందా : **72.00**

Statement about ownership of CHANDAMAMA (Telugu)
Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| *1. Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | MONTHLY<br>Ist of each calender month |
| *3. Printer's Name* | B.V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | B.VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | B.NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. Sri B. VENKATRAMA REDDY<br>2. Sri B.V. NARESH REDDY<br>3. Sri B.V. SANJAY REDDY<br>4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI<br>6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA<br>8. Kum. B.L. ARCHANA<br>9. Kum. B.L. ARADHANA<br><br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |

I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

1st March 1997

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## చిత్రలేఖనం ప్రాధాన్యత!

శరీరానికి వ్యాయామం లాగా మనసుకు ఉల్లాసాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించేవి కళలు. కళలలో చిత్రకళ ముఖ్యమైనది. చిత్రలేఖనం పసిపిల్లలలో ఊహాశక్తిని పెంచుతుంది; వారిలోని పరిశీలనా సక్తికి పదునుపెడుతుంది.

మనదేశంలో విద్యారంగానికి సంబంధించిన వివిధ అంశాలను గురించి క్రమబద్ధంగా పరిశోధనలు జరిపే ఎన్ సి ఇ ఆర్ టి సంస్థ ఈ నిజాన్ని గుర్తించి చిత్రలేఖనాన్ని పదవ తరగతి వరకు పాఠ్యాంశంగా చేయాలని సూచించింది.

ఇప్పటికే మన పాఠశాలలలో చిత్రలేఖనం పాఠ్యాంశంగా ఉన్నది. కాని దానిపట్ల తగినశ్రద్ధ చూపడంలేదు. ఇక ప్రభుత్వ పాఠశాలల సంగతి సరేసరి. చాలినంతమంది ఉపాధ్యాయులు ఉండరు. అవసరమైన పరికరాలు ఉండవు. పేరుకు డ్రాయింగ్ పిరియడ్ ఉన్నప్పటికీ, ఖాళీగా ఉన్న మరే ఉపా ధ్యాయులనో ఆ తరగతికి పంపడం ఆనవాయితీగా ఉంటున్నది. ప్రభుత్వేతర సంస్థలు చిత్రలేఖనం పోటీలు పెడితే, అందుకు విద్యార్థులను పంపడంలో తగిన శ్రద్ధ చూపడంలేదు. ఉపాధ్యాయులేకాదు; తల్లితండ్రులు కూడా ఈ విషయంలో ఆసక్తి కనబరచడం లేదు. పైగా దీనిని పిల్లల చదువుకు అంతరాయంగా భావించే వారూ ఉన్నారు. ఇది సరైన ధోరణికాదు.

పిల్లల మానసిక వికాసానికీ, సర్వతోముఖాభివృద్ధికీ, చిత్ర లేఖనం ఎంతో దోహదం చేస్తుంది. కాబట్టి మన పాఠశాలలలో దీనికి తగిన ప్రాధాన్యత నివ్వడం చాలా అవసరం!

సంపుటి : 100 మార్చ్ '97 సంచిక: 3

విడిప్రతి : 6.00 సంవత్సర చందా : 72.00



వార్తలు – విశేషాలు:

# బంగ్లాదేశ్ జాతిపిత

బంగ్లాదేశ్ ఏర్పడి ఇరవైఅయిదు సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా అక్కడ రజతోత్సవాలు జరుపుకున్నారు. రజతోత్సవాలు ముగిసిన రెండు నెలల తరవాత బంగ్లాదేశ్ ఆవిర్భావానికి పోరాటం సాగించిన షేక్ ముజిబుర్ రెహమాన్‌ను జాతిపితగా ప్రకటించడం జరిగింది. అంతవరకు తూర్పు పాకిస్తాన్‌గా కొనసాగిన ఆ దేశ స్వాతంత్ర్యం కోసం ఉద్యమం నడిపిన నేతగా ముజిబుర్ రెహమాన్ ప్రపంచ ప్రసిద్ధిగాంచాడు.

1947వ సం॥లో ఇండియా విభజన జరిగినప్పుడు ముస్లిం జనాభా అధికంగా గల ఆ ప్రాంతాన్ని పాకిస్తాన్‌కు ఇవ్వడం జరిగింది. దానినితూర్పు పాకిస్తాన్ అనేవారు. అయినప్పటికీ మొదటి నుంచే అక్కడి ప్రజలు పాకిస్తాన్ నుంచి విడిపోయి 'సోనార్ బంగ్లా' ఏర్పాటు చేసుకోవాలని కలలు గనసాగారు.

కాని పాకిస్తాన్ అందుకు అంగీకరించలేదు. ఉద్యమానికి నాయకత్వం వహించిన 'బంగబంధు' షేక్ ముజిబుర్ రెహమాన్ వంటి నాయకులను జైల్లో పెట్టి ఉద్యమాన్ని అణగదొక్కడానికి పూనుకున్నది. పాకిస్తాన్ ప్రతినిధుల వేధింపు చర్యలు మితిమించడంతో అక్కడి ప్రజలు బాధలు భరించలేక పొరుగున ఉన్న పశ్చిమ బెంగాల్, త్రిపుర, మేఘాలయ, అస్సాం ప్రాంతాలకు శరణార్థులుగా రాసాగారు. శరణార్థులకు భారతదేశం ఆదరంతో ఆశ్రయమిచ్చింది. కాని వీరి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోవడంతో దీనికొక శాశ్వత పరిష్కారం వెతకవలసిన అవసరం ఏర్పడింది. శరణార్థులను సొంత దేశానికి పంపాలంటే దానికి తగిన వాతావరణం అక్కడ ఉండాలి. కాబట్టి మనదేశం బంగ్లాదేశ్ విముక్తి సేనలతో చేతులు కలిపి, బల ప్రయోగానికి పూనుకోవలసిన నిర్బంధం ఏర్పడింది.

1971వ సం॥లో పదిహేను రోజులపాటు జరిగిన ఇండియా–పాకిస్తాన్ యుద్ధానంతరం డిసెంబర్ 16వ తేదీ పాకిస్తాన్ సేనలు లొంగిపోయాయి. పాకిస్తాన్ నుంచి తూర్పు పాకిస్తాన్ విడిపోయి బంగ్లాదేశ్ ఏర్పడింది. షేక్ ముజిబుర్ రెహమాన్ విడుదల చేయబడ్డాడు. 1972వ సం॥లో ఆయన దేశ అధ్యక్షుడయ్యాడు. కాని ఆయన 1975 ఆగస్టు 15వ తేదీ కుటుంబంతో సహా రాజధాని ఢక్కాలో హత్యచేయబడ్డాడు. ఆ సమయంలో జర్మనీలో ఉన్న ఆయన ఇద్దరు కుమార్తెలుమాత్రం ప్రాణాలతో తప్పించుకున్నారు. వారిలో పెద్ద కుమార్తె అయిన షేక్ హసీనా వాజేద్ 1981వ సం॥లో ఇంగ్లాండు నుంచి స్వదేశానికి తిరిగి వచ్చి రాజకీయ రంగంలో దిగారు. ఆమె తండ్రి స్థాపించిన అవామీలీగ్ పార్టీనాయకత్వం చేపట్టారు. 1996వ సం॥ జూన్ నెలలో జరిగిన సాధారణ ఎన్నికలలో అవామీలీగ్ విజయం సాధించడంతో హసీనా బంగ్లాదేశ్ ప్రధాన మంత్రి అయ్యారు.

బంగ్లాదేశ్ రాజ్యాంగ శాసనం నాలగవ సవరణలో ముజిబుర్ రెహమాన్‌ను జాతిపితగా పేర్కొని గౌరవించింది. కాని 1979వ సం॥లో సైనిక పాలకులు ఆ సవరణను రద్దు చేశారు. అయినప్పటికీ- బంగబంధు షేక్ ముజిబుర్ రెహమాన్ బంగ్లాదేశ్ జాతిపితగా కొనసాగుతున్నారు; ఆయన పట్ల గౌరవం లేకుండా ప్రవర్తించడం రాజ్యాంగ ధిక్కారంగా భావించబడుతుంది – అని బంగ్లాదేశ్ పార్లమెంటు స్పీకర్ ఫిబ్రవరి 19వ తేదీ ప్రకటించాడు.

బంగ్లాదేశ్ డిసెంబర్ 16వ తేదీ స్వాతంత్ర్య రజతోత్సవాలు జరుపుకున్నది. 1972వ సం॥లో షేక్ ముజిబుర్ రెహమాన్ దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించిన చోట, ప్రస్తుత ప్రధానమంత్రి షేక్ హసీనా వాజేద్ – స్వతంత్ర స్మారక స్తూపానికి శంకు స్థాపన చేశారు.




ఆరోజే మన దేశంలో 'విజయ్ దివస్' ఉత్సవం జరిగింది. రాష్ట్రపతి డా॥ శంకర్‌దయాళ్ శర్మ సైనిక వందనం స్వీకరించారు.




# సద్బుద్ధిమాత్ర

చతురుడు, విదురుడు, ప్రవరుడు అన్నదమ్ములు. తండ్రి పోయాక లంకంత కొంపను మూడు వాటాలుగా విభజించుకుని, ఎవరి మానాన వాళ్ళు కాలం గడుపుతున్నారు. కానీ ఎంతకాలంగడిచినా ముగ్గురి జీవితం ఎదుగూ బొదుగూలేకుండా, గొర్రెతోక బెత్తెడు అన్నట్టుగా వుంటున్నది.

ఒకరోజున బైరాగి ఒకడు ఆఇంటిముందు నిలబడి, "భిక్షాందేహి!" అని కేక వేశాడు.

ఆ సమయంలో అన్నదమ్ములు ముగ్గురూ పొరుగూళ్ళకు వెళ్ళారు. తోడి కోడళ్ళు ముగ్గురూ ఒకచోట చేరి కబుర్లు చెప్పుకుంటూ బైరాగి కేకవిని, "ఎవడో కొత్త బిచ్చగాడిలా వున్నాడు. లేకుంటే ఈ ఇంటి ముందు నిలబడి బిచ్చం కావాలంటాడా?" అనుకున్నారు.

అంతలో బైరాగి మళ్ళీ, "భిక్షాందేహి!" అని కేకవేశాడు.

తోడికోడళ్ళు ముగ్గురూ ఇంట్లోంచి బయటకువచ్చి, బైరాగిని చూసి, "ఈ ఇల్లెవరిదో తెలియదా? ఇక్కడ నీకు బిచ్చం దొరకదు," అన్నారు.

బైరాగి చలించకుండా, "నేనెవరో– తెలియక మీరిట్లా మాట్లాడుతున్నారు. నేనందరిళ్ళలోనూ భిక్ష స్వీకరించను. ఈరోజు మీఅదృష్టం బాగుంది. మీ భిక్ష స్వీకరించడానికి వచ్చాను. నాకు భిక్షవేస్తే మీకు మేలు జరుగుతుంది," అన్నాడు.

వీడెవడో ఘరానాబిచ్చగాడని తోడికోడళ్ళు ముగ్గురూ అనుకున్నా – అయినా ఏ పుట్టలో ఏ పాముందోనని అనుమానించి, "నీలాగా చాలా మంది బిచ్చగాళ్ళంటూంటారు! మరి మేలంటే ఏం జరుగుతుందో చెప్పు," అన్నారు.

"మీ ఇంటి పెరట్లో నిధి దొరికే ఉపాయం చెబుతాను," అన్నాడు బైరాగి.

"వసుంధర"

నిధి అనగానే తోడికోడళ్ళు ముగ్గురికీ ఆశపుట్టింది. బైరాగికి భిక్షవేయడానికివాళ్ళు ముగ్గురూ పోటీపడ్డారు.

బైరాగి వారి విషయం తెలుసుకుని, "ఈ ఇల్లు అన్నదమ్ములది కాబట్టి, మీ ముగ్గురూ ఒక్కటే! ఒకరింట అన్నం వండండి.రెండో ఇంట పచ్చడి, కూర చేయండి. మూడో ఇంట పులుసు, మజ్జిగ సిద్ధం చేయండి. మీ ముగ్గురూ కలిసి నాకు కడుపునిండా అన్నం పెట్టండి. నేను అటుతరవాత మీకు నిధి దొరికే ఉపాయం చెబుతాను," అన్నాడు నమ్మకంగా.



"నిధి ఎవరింట్లో దొరుకుతుంది?" అని అడిగారు తోడికోడళ్ళు ఆత్రుతగా.

"ముగ్గురికీ మూడిళ్ళలో విడివిడిగా నిధి లభిస్తుంది," అన్నాడు బైరాగి.

కోడళ్ళు ముగ్గురూ ఆ పూట బైరాగికి కడుపునిండా తిండి పెట్టారు. బైరాగి త్రేవు మని త్రేన్చి, "చాలా సంతోషం! మీ భర్తలు ఊరినుంచి తిరిగి రాగానే, సాటిమనిషికి సాయపడేవిధంగా మంచిపని చేయమని చెప్పండి. ముగ్గురూ ఆ విధంగా మూడు మంచి పనులు చేశాక, ఎవరి వాటాలో వారు పెరట్లో తోచిన చోట తవ్వితే నిధి బయట పడుతుంది. నేనింకా మూడు రోజులీ ఊళ్ళోనే వుంటాను. కాబట్టి నేను చెప్పినట్టుగా జరక్కపోతే వచ్చి నన్నడగండి," అన్నాడు.

ఈ మాటలకు తోడికోడళ్ళ ముఖాలు వాడిపోయాయి. వాళ్ళు దిగులు పడిపోవడం గమనించిన బైరాగి ఆశ్చర్యపడి – కారణ మడిగాడు.

"అన్నదమ్ములు ముగ్గురూ ఒక్కలాంటి వారే! పరోపకారబుద్ధి బొత్తిగా లేదు. వాళ్ళచేత నువ్వు చెప్పిన విధంగా మంచిపని చేయిం చడం అసాధ్యం. అసలు నీకిలా భోజనం పెట్టిన విషయం తెలిసిందంటేనే, వాళ్ళు మండిపడతారు. వాళ్ళూళ్ళో లేరుకదా అని, మేమీ సాహసం చేశాం," అన్నది పెద్దకోడలు.

బైరాగి క్షణంపాటు ఆలోచించి, "నావద్ద సద్బుద్ధిమాత్రలు మూడున్నాయి. మీ ముగ్గురికీ తలొకటి ఇస్తాను. ఆ మాత్రలను రాత్రి పడుకోబోయే ముందు మంచినీళ్ళలో కరిగించి, మీ మీ భర్తలకివ్వండి. తెల్లవారి నిద్ర లేచేసరికి వారిలో సద్బుద్ధి పుడుతుంది. ఆ మాత్ర ప్రభావం మర్నాడు సూర్యాస్తమయం దాకా వుంటుంది," అంటూ ముగ్గురికీ తలొక మాత్రా ఇచ్చి వెళ్ళిపోయాడు.



రాత్రికి భర్తలు ఊరినుంచి తిరిగిరాగానే తోడికోడళ్ళు ముగ్గురూ, బైరాగి చెప్పినవిధంగా వాళ్ళకు మంచినీళ్ళలో కలిపి మాత్రల నిచ్చారు.

మర్నాడు చతురుడికి పెందరాళే మెలకువ వచ్చింది. లేచి వీధితలుపు తీసుకుని అతడు బయటకురాగానే, రక్షకభటులూ, వీధి చివర వుండే రాఘవయ్యా కనిపించారు. రాఘవయ్య ఏడుస్తూండడం గమనించి, "ఏం జరిగింది రాఘవయ్యా?" అని పలకరించాడు చతురుడు.

రక్షకభటులు, చతురుడితో, "వీడు అందరిదగ్గరా అప్పులుచేసి ఇల్లు, పొలంకొన్నాడు. ఇల్లు పెళ్ళాం పేరున వుంది.పొలం పిల్లల పేరున వుంది. అప్పులు తీర్చడానికి వీడిదగ్గర ఏమీ లేదు. అప్పులవాళ్ళు ఫిర్యాదు చేశారు. వీణ్ణి కారాగారంలో వేయడానికి తీసుకువెళుతున్నాం," అన్నారు.

"కారాగారంలో వేస్తే అప్పు ఎలా తీరుతుంది? బయటవుంటే ఏదో విధంగా అప్పు తీర్చగలడు గదా!" అన్నాడు చతురుడు.

"తప్పు చేసిన వాడు బయట స్వేచ్ఛగా వుండాలంటే, నూరువరహాలు ధరావత్తు కట్టాలి. వీడి భార్య, పిల్లలు అందుకు సిద్ధంగా లేరు. ధరావత్తు కట్టడానికి వీడి దగ్గర డబ్బులేదు. అందువల్ల కారాగారంలో వేయడానికి తీసుకుపోతున్నాం," అన్నారు రక్షకభటులు.

వెంటనే చతురుడు, "అయ్యో! నూరు వరహాలకోసం అన్యాయంగా సాటిమనిషిని కారాగారం పాలుచేస్తారా? ముందు రాఘవయ్యను విడిచి పెట్టండి. నేనా డబ్బు ఇస్తాను," అంటూ లోపలకువెళ్ళి, నూరు వరహాలు తెచ్చి రక్షక భటులకిచ్చి, "నా ఇంట్లో ఎన్నడూ ఇంత డబ్బుండదు. ఎడ్లజత కొందామని ఎంతోకాలంగా కూడబెడితే, ఇదిపోగయింది.నిన్న సంతకు వెళితే బేరం కుదరలేదు. అంతా రాఘవయ్య అదృష్టం," అన్నాడు.

రక్షకభటులు, రాఘవయ్యను విడిచి పెట్టి వెళ్ళిపోయారు. తర్వాత చతురుడు, రాఘవయ్యనూ, అతడి భార్యాబిడ్డలనూ, అప్పుల వాళ్ళనూ ఒకచోట చేర్చి హితబోధ చేశాడు. రాఘవయ్య భార్యాబిడ్డలు తాము చేసిందానికి సిగ్గుపడి, అప్పులవాళ్ళ బాకీలు తాము తీర్చగలమని హామీపత్రాలు రాసివ్వడమేకాక,రాఘవయ్యకోసం ధరావత్తుగా కట్టిన నూరు వరహాలను చతురుడికి తిరిగి ఇచ్చేశారు. అప్పులవాళ్ళు తృప్తిపడి వెళ్ళి పోయారు.

అప్పుడు రాఘవయ్యభార్య, చతురుడితో, "అయ్యా! తమకూ, నా భర్తకూ ఎన్నోఏళ్ళుగా విరోధముంది. అందులో తప్పు నా భర్తదే అని నాకు తెలుసు. అలాంటి నాభర్తకోసం తమరింత సాయం చేశారు. తమరెంతో మంచివారు. అయితే భర్త కారాగారం పాలవు తూంటే చూస్తూ వూరుకున్నామని, మమ్మల్ని గురించి తమరు తప్పుగా భావించవచ్చు. కానీ నిజం తెలుసుకోండి. తను కారాగారం పాలైనా సరే, అప్పులవాళ్ళ బాకీలు తీర్చరాదని, నా భర్త ఒట్టుపెట్టాడు. అందుకే అలాచేశాం. శత్రువుకైనా సాయపడే తమరి మంచితనం, ఇప్పుడు నా భర్తలో కూడా మార్పుతెచ్చి, ఆయన అనుమతించడంతో మేమూ మారి పోయాం. తమకుశ్రమఇచ్చినందుకు మన్నించ గలరు," అన్నది.



రాఘవయ్య కూడా తన పాత తప్పులు మరిచిపోయి, ఇక మీదట స్నేహంగా వుందా మనిచతురుడితోఅన్నాడు. చతురుడు సంతో షంగా ఇంటికి వెళ్ళాడు.

ఆరోజు విదురుడికీ ఇతరులకు సాయపడే అవకాశం వచ్చింది. ముగ్గురు అన్నదమ్ముల్లో అతడు బలశాలి. ఎదురింట్లో బావి తవ్వు తూంటే, పెద్దరాయి అడ్డు వచ్చిందట. ఆ రాతిని ఎంత కొట్టినా పగలడం లేదట. ఐదుగురి బలం కలిసిన సమ్మెటపోటు ఒక్కటి పడితే, రాయి పగలవచ్చునని కొంద రంటున్నారు. ఆ మాట విదురుడు విన్నాడు. అయితే, అతడు వున్నపళంగా పొరుగూరు వెళ్ళవలసి వున్నది. అతడివద్ద కొబ్బరికాయ లున్నాయి. వాటికి మంచి ధరయిస్తానని, ఒక ఆసామీ అన్నాడు. వెంటనే వెళ్ళి కాయలందజేయక పోతే, ఆబేరం పోతుంది. అందువల్ల యాభై నుంచి నూరు వరహాల దాకా నష్టం వుండవచ్చు.

ఇప్పుడు ఎదురింట్లో సమస్యవేరు. మొత్తం నలుగురు పనివాళ్ళు, రెండు రోజులనుంచి ఆ బావిని తవ్వుతున్నారు. ఈ రోజుతో ఆ పని ఆగిపోయింది. వాళ్ళు పని ఆపి వెళ్ళిపోతే బావి తిరిగి పూడుకుపోతుంది. అంతవరకూ పెట్టిన ఖర్చు వృధా అవు తుందని, ఆ ఇంటి యజమాని దిగులుగా వున్నాడు.

విషయం తెలియగానే విదురుడు-అక్కడికి వెళ్ళాడు. అతడు సమ్మెటతో బలంగా నాలుగు దెబ్బలు వేయగానే, రాయి బద్దలయింది. ఆ వెంటనే బావిలో నీరు చిమ్మింది. ఆ తర్వాత విదురుడు కొబ్బరి



కాయలు తీసుకుని పొరుగూరు వెళ్ళాడు. మంచిలాభానికి కాయలమ్ముకోగలిగాడు.

ప్రవరుడికింకోరకం అవకాశం వచ్చింది. ఊళ్ళో కాయకష్టం చేసి బతికే వీరప్పను పాముకరిచింది. గ్రామ వైద్యుడేదో మందిచ్చి, "వీడిప్రాణం పోకుండా ఈ మందు కాపాడుతుంది. ఒక్క రోజులోగా వీడిచేత ఉరగ గంధలేహ్యం తినిపించాలి. లేకుంటే వీడి కాళ్ళు రెండూ చచ్చుబడిపోతాయి. ఒకసారి కాళ్ళు చచ్చుబడిపోతే, వీడికి నయం చేయడం అసాధ్యం!" అన్నాడు.

ఉరగగంధలేహ్యం పట్నంలో ప్రమోదుడనే వైద్యుడివద్ద మాత్రమున్నది. మామూలుగా పట్నం వెళ్ళి రావాలంటే రోజుకు పైగా పడుతుంది. ఈలోగా జరగవలసిన ప్రమాదం జరిగిపోతుంది!

ఆ ఊరి గ్రామాధికారి వద్ద మేలుజాతి గుర్రమున్నది. దానిపై స్వారీచేయగల రాజభటుడు సెలవుపెట్టి అత్తవారింటికి వెళ్ళాడు. గుర్రపుస్వారీచేస్తూ పట్నం వెళ్ళగలవాడు, ఆ ఊరిమొత్తానికి ప్రవరుడొక్కడే! అయితే, మాసం రోజులక్రితం ప్రవరుడికి భరించరాని కడుపునొప్పి వచ్చి తగ్గింది. అప్పుడు వైద్యుడు అతడిని ఏడాదిపాటు వేగంగా నడవవద్దనీ, పరుగులు చేయవద్దనీ, గుర్రపుస్వారీ మానుకోమనీ హెచ్చరించాడు.

వీరప్ప ప్రాణం రక్షించడంకోసం ప్రవరుడు, వాడిని గుర్రంమీద వేసుకుని పట్నం చేరి, ప్రమోదుడి వద్దకు వెళ్ళాడు. ఆయన వీరప్పకు ఉరగగంధలేహ్యం ఇవ్వడమే గాక, పరోపకారానికై సొంతఆరోగ్యాన్ని కూడా లెక్కచేయని ప్రవరుడి పరోపకారబుద్ధిని మెచ్చుకుని,కాయకల్పమనే మందును అతడిచేత తినిపించాడు. ఆ తర్వాత నుంచి అతడు రోజంతా గుర్రపుస్వారీ చేసినా ఎలాంటిహానీ కలగదట. ఆ విధంగా పట్నం నుంచి వీరప్పను క్షేమంగా తీసుకువచ్చిన ప్రవరుణ్ణి, ఊళ్ళో అందరూ మెచ్చుకున్నారు.

తమ తమ భర్తలు సత్కార్యాలు చేసినందుకు, ముగ్గురు తోడికోడళ్ళూ ఎంతో సంతోషించారు. బైరాగి చెప్పినవిధంగా మర్నాడు ఎవరి పెరట్లో వారు తవ్వి చూస్తే, ప్రవరుడికి రాగికాసుల రాగిబిందె దొరికింది. విదురుడికి వెండికాసుల వెండిబిందె దొరికింది. చతురుడికి బంగారుకాసుల బంగారు బిందె దొరికింది.

చతురుడి భార్యకు పరమానందంగా వున్నప్పటికీ విదురుడి భార్యా, ప్రవరుడి

భార్యా దిగులుపడ్డారు. వాళ్ళు బైరాగిని వెతుకుతూ బయల్దేరారు. ఒకచోట వాళ్ళకుబైరాగి కనిపించి, తానే ముందుగా వాళ్ళను పలకరించాడు.

ప్రవరుడి భార్య జరిగినదంతా చెప్పి, "ముగ్గురూ మంచిపనులు చేశారు. ముగ్గురికీ నీ మాత్ర వల్లనే సద్బుద్ధి కలిగింది. అలాంటప్పుడు ఫలితం మాత్రం ముగ్గురికీ వేర్వేరుగా ఎందుకుండాలి?" అన్నది ఏడుపు గొంతుతో.

"నా మాత్ర తాత్కాలికంగా సద్బుద్ధినిస్తుంది. ఆ తర్వాత ఫలితం మాత్రం వారి వారి బుద్ధుల్నిబట్టి వుంటుంది," అన్నాడు బైరాగి.

"అన్నదమ్ముల ముగ్గురి బుద్ధులూ ఒకలాంటివే!" అన్నది విదురుడిభార్య.

"కాదు!" అన్నాడు బైరాగి, "ప్రవరుడొక మంచి పనిచేసి, ఒక మనిషి ప్రాణంనిలిపాడు. కానీ నా మాత్ర ప్రభావం అయిపోగానే, తను చేసిన మంచిపనికి విచారపడి, మళ్ళీ ఏనాడూ అలా చేయకూడదనుకున్నాడు. అందుకే అతడికి శ్రమకు తగ్గ ఫలితం మాత్రం లభించింది. విదురుడు మంచి పనిచేశాక, అస్తమానూ ఇలా సమయం వృధా చేయకూడదనీ, అప్పుడప్పుడు మాత్రం మంచి పనులు చేస్తూండాలనీ అనుకున్నాడు. అతడికి కాస్త ఎక్కువ ఫలితం లభించింది. చతురుడికి తను చేసిన మంచిపని ఎంత సంతోషం కలిగించిందంటే, ఇక మీదట ఇలాగే మంచి పనులు చేస్తూండాలనుకున్నాడు. అతడు సద్బుద్ధిని శాశ్వతం చేసుకున్నాడు. అందుకే అతడికి సువర్ణయోగం కలిగింది."

బైరాగి ఇంతచెప్పినా, తోడి కోడళ్ళిద్దరూ అసంతృప్తిగా ఇల్లుచేరారు. ఎవరివాటాలోకి వాళ్ళు వెళ్ళగానే విదురుడు, ప్రవరుడుతమ తమ భార్యలకు బంగారు కాసులు చూపించారు. ఆ ఇంట్లో ఎవరికేం దొరికినా,అంతా సమంగా పంచుకోవాలన్నాడట చతురుడు. ఆవిధంగానే అతడు దొరికినబంగారు, వెండి, రాగికాసులు తనతోపాటు అన్నదమ్ములిద్దరికీ సమంగా పంచిఇచ్చాడట.

ముగ్గురన్నదమ్ముల్లోకీ సద్బుద్ధిని శాశ్వతం చేసుకున్నవాడు చతురుడే అన్న బైరాగిమాట ఋజువవడమే కాదు – సద్బుద్ధి వున్నవాడికే బంగారమెందుకు దొరకాలో కూడా విదురుడి, ప్రవరుడిభార్యలకు తెలిసివచ్చింది.



# ప్రోత్సాహక బహుమతి!

హేలాపురిలో ప్రతిఏడూ చిత్రలేఖనం పోటీలు జరుగుతూంటాయి. దేశంలోని అనేకమంది చిత్రకారులు, ఆ పోటీలలో పాల్గొంటూంటారు. పోటీలో గెలుపొందిన చిత్రకారులకు విలువైన బహుమతులు ఇచ్చేవారు. అలా బహుమతి గెలుచుకోవడం ఎంతో గొప్ప ప్రతిష్ఠగా ప్రతి చిత్రకారుడూ భావించేవాడు.

ఎప్పటిలాగే ఆ ఏడు కూడా చిత్రలేఖనం పోటీలు ఏర్పాటయ్యాయి. దేశంలోని అన్ని ప్రాంతాలనుంచీ చిత్రకారులు తమ తమ చిత్రాలతో హేలాపురి చేరారు.

సుగంధపురిలో ఉండే విశ్వాసుడనే యువకుడు కూడా ఈ పోటీల్లో పాల్గొన్నాడు. అతడు తిరిగి సుగంధపురి చేరాక, అతడి మిత్రులు, "నీ చిత్రాలకు ఏమైనా బహుమతి లభించిందా?"అని అడిగారు.

తనకు ప్రోత్సాహక బహుమతి మాత్రమే లభించిందని, విశ్వాసుడు విచారపడుతూచెప్పాడు.

అందుకు మిత్రులు, "ప్రోత్సాహక బహుమతి మాత్రమే లభించిందని విచారపడకు. అది కూడా లభించని చిత్రకారులెందరో వుండివుంటారు!" అని ఊరడించారు.

"నా విచారం అందుకు కాదు. నాకు బహుమతిగా ఇచ్చిన గ్రంథం చూసి!" అన్నాడు విశ్వాసుడు.

"ఏమిటా గ్రంథం?" అని మిత్రులడిగితే, విశ్వాసుడు వాళ్ళకాగ్రంథం చూపించాడు.

ఆ గ్రంథంపేరు: చిత్రాలుగీయడం ఎలా? — కోనే నాగవెంకటఆంజనేయులు





# సామ్రాట్ అశోక

3

[చంద్రగుప్తుడు చాణక్యుడి సాయంతో నందులను ఓడించి మగధరాజ్యాన్ని వశపరుచుకుని, పాటలీపుత్రం రాజధానిగా మౌర్యవంశాన్ని స్థాపించాడు. ఆయన తదనంతరం ఆయన కుమారుడు బిందుసారుడు మౌర్యసింహాసనాన్ని అధిష్ఠించాడు. బిందుసారుడు దక్షతతో రాజ్యాన్ని పాలిస్తూ, ముగ్గురు రాణులతో పాటు సుభద్ర అనే బ్రాహ్మణకన్యను వివాహమాడాడు. వారికి అశోకుడు జన్మించాడు. విద్యావివేకసంపన్నుడైన అశోకుడంటే బిందుసారుడి జ్యేష్ఠ కుమారుడైన సుశేముడికి గిట్టేది కాదు. తరవాత–]

ఒకనాడు సూర్యోదయంవేళ, అశోకుడు తల్లి కోరిక ప్రకారం పుష్పాలూ, ఫలాలూ తీసుకుని నగర మధ్యంలో ఉన్న దేవాలయానికి వెళ్ళి, దేవుడికి సమర్పించి, ఆలయం నుంచి వెలుపలికి వచ్చాడు. చెట్ల మీది పక్షుల కిలకిలారావాలూ, అప్పుడప్పుడుగుడి గంటలనాదం తప్ప ఆలయ ప్రాంగణంఎంతో ప్రశాంతంగా ఉన్నది. అశోకుడు ఆకాశంలో ఎగిరే పక్షులనూ,ఉదయభానుడి లేత కిరణాలకు బంగారంలా మెరుస్తూన్న మేఘాలనూ చూస్తూ నడవసాగాడు. కొంతసేపటికి వెనక నుంచి వచ్చిన ఒక గుర్రం అతన్ని హఠాత్తుగా కిందపడదోసి ముందుకు దూసుకు వెళ్ళింది. గుర్రంమీద యువరాజు సుశేముడు స్వారీ చేస్తున్నాడు!

అశోకుడు మరుక్షణమే లేచి, శరవేగంతో పరిగెత్తి పోయి ఒక్కగెంతున గుర్రం మీదికి లంఘించి సుశేముడి చేతి నుంచి కళ్ళాన్ని

లాక్కుని గుర్రాన్ని ఆపాడు. సుశేముడు గుర్రంపైనుంచి కిందికి దిగాడు.

"నా దారిన నేను వెళుతూంటే నన్నెందుకు కింద పడదోశావు?" అని అడిగాడు అశోకుడు.

"నిన్నుపడదోసింది నేను కాదు, నాగుర్రం!" అంటూ సుశేముడు మళ్ళీ గుర్రాన్ని అధిరోహించబోయాడు.

అశోకుడు అతని చేయిపట్టుకుని ఆపి, "నిర్మానుష్యంగాఉన్నవిశాలమైనబాటలోసైతం తిన్నగా వెళ్ళడం చేతకాని నీకు గుర్రం మీద స్వారీచేసే అధికారం ఎవరిచ్చారు?" అన్నాడు.

"నా అధికారం గురించి ప్రశ్నించడానికి నువ్వెవడివి? అసలు నేనెవరో నీకు తెలుసా?" అన్నాడు సుశేముడు.

"తెలియకేం? ఎందుకూ కొరగానిగర్విష్ఠివి! నాకు అన్నవైనందున నిన్ను వదిలిపెడుతున్నాను. లేకుంటే ఈ జన్మకు మరిచిపోలేని గుణపాఠం నేర్పేవాణ్ణి!" అన్నాడు అశోకుడు.

"కాబోయే రాజునే బెదిరిస్తున్నావా?" అన్నాడు సుశేముడు ఆగ్రహంగా.

"కాబోయేరాజు ఎవరన్నది ఇంకానిర్ణయం కాలేదు," అన్నాడు అశోకుడు.

"సంగతి తెలియకుండా మూర్ఖంగా మాట్లాడకు. మహారాజూ,పెద్దలూ తీసుకున్ననిర్ణయం నాకు తెలిసిపోయింది. నేనే కాబోయేరాజును!" అన్నాడు సుశేముడు, గర్వంతో పకపకా నవ్వుతూ.

"అలా అయితే, నువ్వు మరింత జాగ్రత్తగా నడుచుకోవాలి. అయినా, నువ్వు అబద్ధమాడుతున్నావని నాకుతెలుసు. ఒకవేళ అలా నిర్ణయించి ఉన్నట్టయితే దానిని నేను వ్యతిరేకిస్తాను!" అన్నాడు అశోకుడు.



"ఏమిటీ! మహారాజుగారినిర్ణయాన్నే వ్యతిరేకిస్తావా?" అంటూ సుశేముడు అశోకుణ్ణి కొట్టడానికి చేయి పైకెత్తాడు.

అశోకుడు అతని చేతిని వడిసి పట్టుకున్నాడు. చేతిని విడిపించుకోవడానికి సుశేముడు ప్రయత్నించాడు. కాని సాధ్యపడలేదు. ఇద్దరి మధ్యా పెనుగులాట ఆరంభమయింది. వారి అరుపులతో ఆలయప్రాంతం దద్దరిల్లింది. చుట్టుపక్కల నుంచి జనం మూగసాగారు.

రాజకుమారులు ఇప్పుడు పసిపిల్లలు కారు.చాణక్యుడు వాళ్ళ తెలివితేటలను పరీక్షించి సంవత్సరాలు గడిచిపోయాయి. చాణక్యుడు కూడా కాలధర్మం చెందాడు. రాజు బిందుసారుడు వృద్ధుడయ్యాడు. దానికి తోడు అనారోగ్యం. యువరాజులిద్దరి మధ్య



ఉన్న స్పర్థల గురించి నగర ప్రజలకు తెలుసు. అయితే, అది ఇంత దారుణంగా ఎప్పుడూ బయటపడలేదు. మౌర్యవంశాన్ని స్థాపించిన చంద్రగుప్తుడి మనుమలూ; తండ్రికి తగిన వారసుడని పేరుగాంచిన బిందుసారుడి కుమారులూ అయిన సుశేమ – అశోకులు ఈ విధంగా బహిరంగంగా పోట్లాటకుదిగడం ఎవరూ ఊహించని విషయం! వాళ్ళ కేకలు విని ప్రజలు పరిగెత్తివచ్చారుగాని, ఏ ఒక్కరూ వాళ్ళను సమీపించలేక పోయారు. దూరం నుంచీ, చాటునుంచీ భయాశ్చర్యాలతో చూడ సాగారు.

అదృష్టవశాత్తు ఆసమయంలో భల్లాట కుడు అటువైపు గుర్రం మీద వచ్చాడు. చాణక్యుడి అనంతరం భల్లాటకుడు మగధ రాజ్యానికి ప్రధానమంత్రి అయ్యాడు. అతన్ని చూడగానే రాజకుమారులిరువురూపోట్లాడడం మాని చెరొకవైపు దూరంగా వెళ్ళి నిలబడ్డారు.

"నడివీధిలో నగర ప్రజల ఎదుట మీరీ విధంగా పోట్లాడుకోవడం చాలా దురదృష్టం. ఈసంగతి మీతండ్రికితెలిస్తే, ఆయన ఎంతగా బాధపడగలరో ఊహించారా?" అన్నాడు ప్రధానమంత్రి.

అశోకుడు ఏమీ మాట్లాడలేదు. సుశేముడు మాత్రం, "నేనెవరికీ భయపడి పారిపోనవసరం లేదు. అదిసరే, నేనేకదా కాబోయే రాజును?" అని అడిగాడు మంత్రిని.

"ఆ విషయం ఇంకా నిర్ణయం కాలేదని భావిస్తున్నాను యువరాజా!అయినా, రాజుగారి జ్యేష్ఠకుమారుడిగా నువ్వు ఎంతో ఉదాత్తంగా నడుచుకోవడం అవసరం కదా?" అన్నాడు మంత్రి.

"నా హెూదాను గౌరవించమని వీణ్ణి నిర్బంధించాను. అది తప్పా?" అని రెట్టించాడు సుశేముడు.

"ఎదుటివారిని నిర్బంధించడం వల్ల, అవమానించడం వల్ల నీ గౌరవం పెరగదు. సత్ప్రవర్తన ద్వారానువ్వు పదిమందికీ గౌరవ పాత్రుడివి కావాలి. ఎదుటి వారిపట్ల దయా దాక్షిణ్యాలు, ఓర్పు అలవరుచుకోవాలి. అంతే కాని అల్పవిషయాలకు ఇలా పదిమందిలో నవ్వులపాలుకావడం భావ్యం కాదు!"అన్నాడు ప్రధానమంత్రి గంభీరంగా.

"నేనేమీ పదిమందిలో నవ్వులపాలు కాలేదు. తృటిలో తప్పి పోయింది కానీ, లేకుంటే ఇంతకుముందు ఆపొగరుబోతును ప్రాణాలతో చర్మంవలిచి ఉండేవాణ్ణి.అప్పుడు వాడే ప్రజల ముందు నవ్వులపాలై వుండే

వాడు!" అన్నాడు సుశేముడు ఎంతో పొగరుగా.

"యువరాజా! నీ సోదరుణ్ణి గురించి నువ్వలా చులకనచేసి మాట్లాడరాదు. ఆయన కూడా నీలాగా యువరాజే! నీతండ్రి కుమారుడే!" అన్నాడు మంత్రి.

"వాడు నా తండ్రి కుమారుడే కావచ్చు. కాని వాడితల్లి, వివాహానికి ముందు అంతః పురంలో నా తల్లి మొదలుగాగల రాణులకు సేవలు చేసింది. కాబట్టి వాణ్ణి నేను యువ రాజుగాఅంగీకరించను," అన్నాడు సుశేముడు.

ఆ మాటకు ఆగ్రహం చెందిన అశోకుడు సుశేముడిమీదికి ఉరకబోయాడు. కానిమంత్రి వారించాడు.

"అర్హుడైన గొప్ప యువరాజు నువ్వా, నేనా అన్నది కాలమే నిరూపిస్తుంది. నాతల్లిని అవమానించినందుకు నీ మీద పగసాధిస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ! ప్రధానమంత్రీ, ఇక్కడున్న ప్రజలే దీనికి సాక్ష్యం! మగధ సింహాసనాన్ని అధిష్ఠించబోయేది నువ్వు కాదు... కాని," అని అశోకుడు ఇంకా ఏదో అనబోతూండగా ప్రధానమంత్రి తన అరచేతిని అశోకుడి నోటికి అడ్డుపెట్టి మాటను పూర్తికాకుండా ఆపి, "మహారాజు బిందుసారుడి తరుపున ఆజ్ఞాపిస్తున్నాను. మీరిద్దరూ ఈ క్షణమే ఇక్కడి నుంచి రాజభవనానికి వెళ్ళండి!" అని హెచ్చ రించాడు. ఆ తరవాత మంత్రి చుట్టూచేరిన ప్రజలను, "అందరూ వెళ్ళిపొండి," అనిఆజ్ఞా పించాడు.

ప్రజలందరూ వెళ్ళిపోయారు. యువరాజు లిద్దరూ ఒకరినొకరు ఆగ్రహంగా చూసు కుంటూ తమతమ భవనాలకు వెళ్ళారు.



ప్రధానమంత్రి అక్కడినుంచి తన గృహా నికి తిరిగివెళ్ళి, గుర్రం పైనుంచి దిగి భవన ప్రధానద్వారాన్ని సమీపిస్తూండగా, రాజు బిందు సారుడి ప్రధాన సలహాదారు ఎదురుపడి ఆయనకు నమస్కరించి, "మహారాజు తమతో ఏదో మాట్లాడాలట!" అన్నాడు.

"సరే, వెళదాం పద," అంటూ అతనివెంట బయలుదేరి సమీపంలోనే ఉన్న రాజభవ నంలో ప్రవేశించి, రాజు విశ్రాంతి తీసుకుం టూన్న ఏకాంతమందిరానికి వెళ్ళాడు.

రాజు బిందుసారుడు విశాలమైన గదిలో ఒక పెద్దపానుపు మీద కూర్చుని ఉన్నాడు. ఆయన ఎదుట అధికారి ఒకడు నిలబడి ఉన్నాడు. మంత్రి సమీపించి నమస్కరించ గానే ఆయన్ను కూర్చోమని ఆసనం చూపాడు రాజు.



ఆయన కూర్చున్న తరవాత రాజు, "భల్లాటకా, ఈరోజు ఒక దుర్వార్త వినవలసి వచ్చింది. దానిని తక్షశిల నుంచి వచ్చిన ఈ అధికారి మీకు తెలియజేస్తాడు!" అన్నాడు.

అధికారి ప్రధాన మంత్రికి నమస్కరించి, "మంత్రివర్యా, చంద్రగుప్త మహారాజు తక్షశిల ప్రాంతాన్నిజయించి, తమ ప్రతినిధిని అక్కడ నిర్ణయించిన నాటినుంచి నిన్న మొన్నటి వరకు ఎలాంటి అవరోధాలు లేకుండా పరిపాలనా వ్యవహారాలు సాగుతూవచ్చాయి. కాని, ఇప్పుడు మౌర్యఅధికారాన్ని ధిక్కరించి తక్షశిలలో తిరుగుబాటు బయలుదేరింది. మగధరాజ్యం నుంచి విడిపోవాలని కొందరు పోరాడుతున్నారు!" అన్నాడు.

"అలాగా! చాలావింతగా ఉన్నదే,"అన్నాడు ప్రధానమంత్రి.

"తక్షశిల ప్రజలకు మీరు ఎటువంటి అపకారమూ చేయలేదు. అందువల్ల వారి చర్య మీకు వింతగానే ఉండవచ్చు. అయితే, అక్కడున్న రాజప్రతినిధికీ, మాకూ అది వింతగా తోచడం లేదు. ఎందుకంటే ఈ తిరుగుబాటు వెనక గ్రీకులహస్తం ఉన్నదని మాకు సమాచారం అందింది. మహారాజు చంద్రగుప్తుడు వాళ్ళను అక్కడినుంచి తరిమి గొట్టాడన్న సంగతి వాళ్ళింకా మరిచిపోలేదు. ఇప్పుడు అధికారానికి ఎదురుతిరిగి మనల్ని వేధించడానికి ఉద్రిక్తులవుతున్నారు. మగధ సామ్రాజ్యం విచ్ఛిన్నం కావాలని కలలుకంటు న్నారు!" అన్నాడు అధికారి.

"తిరుగుబాటు ఏపద్ధతిలో జరుగుతు న్నది?" అని అడిగాడు ప్రధానమంత్రి.

"తిరుగుబాటు నాయకులు తెరమరుగున ఉన్నారు. బయటపడడంలేదు. వర్తకులనూ, ప్రముఖులనూ ఎదురుతిరగమని ప్రోత్స హిస్తున్నారు. మగధ అధికారుల ఇళ్ళపైబడి దోచుకుని వాటిని తగులబెట్టమని సాధారణ ప్రజలను రెచ్చగొడుతున్నారు. ప్రజలు అక్క డున్న మనసైనికులు పలువురిని హతమా ర్చారు. రోజురోజుకూ పరిస్థితి విషమిస్తున్నది!" అన్నాడు అధికారి.

"ఇప్పటికే వాళ్ళు హింసాత్మక చర్యలకు పూనుకున్నారుగనక, వాటిని మరింత బలంతో అణగదొక్కడం తప్ప మరొకమార్గం లేదు," అని రాజుకేసితిరిగి,"ప్రభూ!తక్షశిలపై సైనిక చర్యకు తక్షణమే సిద్ధంకమ్మని సేనాధిపతిని ఆజ్ఞాపించండి!" అన్నాడు ప్రధానమంత్రి.

"అపూర్వమైన బలపరాక్రమాలతో మా తండ్రి స్థాపించిన సామ్రాజ్యం నా కళ్ళెదుటే

విచ్ఛిన్నం కావడం చూస్తూ నేను ఊరుకోలేను. ఆ దుండగుల మీదికి నేనే నాయకత్వం వహించి సైన్యాన్ని నడుపుతాను," అన్నాడు బిందుసారుడు ఆవేశంతో నిట్టూరుస్తూ.

"తమ అభీష్టానుసారమే చేయవచ్చు. కాని ఒక విన్నపం. తమ ఆరుగురు కుమారులలో ఒకరిని సైన్యానికి నాయకత్వం వహించమని ఆజ్ఞాపించండి. కుమారుడునాయకత్వం వహిస్తే, తండ్రి వహించినట్టే కదా!" అన్నాడు ప్రధానమంత్రి.

"ఎటువంటి క్లిష్టపరిస్థితి ఏర్పడింది! సుశేముడికి యౌవరాజ్య పట్టాభిషేకం జరపాలనుకుంటున్నప్పుడు ఇటువంటి అవాంతరం!" అన్నాడు బిందుసారుడు మనసులో అనుకుంటున్నట్టు నెమ్మదిగా.



"పట్టాభిషేక మహోత్సవానికి కొంతకాలం వేచి ఉండడం మంచిది ప్రభూ! మొదట యువరాజు సుశేముడు సైన్యానికి నాయకత్వం వహించి వెళ్ళి, తిరుగుబాటునుఅణచి రానివ్వండి. అది యువరాజుపట్ల మగధ ప్రజల గౌరవాన్ని, నమ్మకాన్నిపెంచుతుంది," అన్నాడు ప్రధానమంత్రి.

రాజు మాట్లాడకుండామౌనంవహించాడు. ప్రధానమంత్రి మళ్ళీ, "ప్రభూ, నాదొక చిన్న మనవి.మనంయువరాజును సైన్యానికి నాయకత్వం వహించమని మొదట చెప్పకుండా, అందుకు ఆయనే స్వయంగా ముందుకు వచ్చేపరిస్థితినిసృష్టిద్దాం.అంటే యువరాజులు ఆరుగురినీ ఇక్కడికి రప్పించి, తక్షశిలలో జరుగుతూన్న తిరుగుబాటును గురించీ, దానిని అణచడానికి రాకుమారులలో ఒకరు సైన్యానికి నాయకత్వం వహించి వెళ్ళవలసిన అవసరం గురించీ చెబుదాం. జ్యేష్ఠకుమారుడు కాబట్టి సుశేముడు సైన్యానికి నాయకత్వంవహించి వెళ్ళడానికి సంసిద్ధుడవుతాడు. ఇప్పటికే ఆయన మగధరాజ్యానికి కాబోయే రాజునన్న ఉత్సాహంతో ఉన్నాడు కాబట్టి, ఆయన ఇందుకు ఆనందగా అంగీకరిస్తాడు," అన్నాడు.

బిందుసారుడికి ప్రధానమంత్రి సలహా నచ్చింది.ఆయనచెప్పినట్టే చేయడానికి సమ్మతించాడు.

ఆరోజే ఆరుగురు యువరాజులనూరాజు సమక్షానికి పిలిపించారు. అక్కడ ప్రధానమంత్రిని చూడగానే, యువరాజు సుశేముడు ఒక్కక్షణం నివ్వెరపోయాడు. తానూ, అశోకుడూ ఉదయం ఆలయ ప్రాంతంలో పడ్డ గొడవ గురించి ఆయన తండ్రికి తెలియ

జేశాడేమో అని అనుమానించి భయ పడ్డాడు!

రాజు ఆరుగురు కుమారులనూ చేర బిలిచి, "మీరు పసిపిల్లలు కారు. నవయౌవన ప్రాయంలో ఉన్నారు. రాజ్య పరిపాలనా వ్యవహారాలు సక్రమంగా సాగడానికి మీరు మీమీ బాధ్యతలను గుర్తెరిగి నడుచుకో వలసిన సమయం ఆసన్నమయింది. అందుకు మీకు ఇప్పుడొక అవకాశం కూడా లభించింది. తక్షశిల ప్రాంతంలో తిరుగు బాటు చెలరేగి, అక్కడ శాంతిభద్రతలకు భంగం వాటిల్లుతున్నదని సమాచారం అందింది. తిరుగుబాటును అణచాలి. మీలో ఒకరు మన సైన్యానికి నాయకత్వం వహించి వెళ్ళి, తిరుగుబాటును అణచి, ఆ ప్రాంతంలో శాంతిభద్రతలను నెలకొల్పాలి! ఆ పనిని మీలో ఎవరుచేయగలరు?" అని అడిగాడు.

సుశేముడు వెంటనే ముందుకు రాగలడని బిందుసారుడు భావించాడు. కాని అతడు మౌనం వహించాడు. మిగతా నలుగురు కుమారులు కూడా మౌనంగా తలలు వంచు కున్నారు. ఆఖరికి అశోకుడు ఒక అడుగు ముందుకు వేసి, "ప్రభూ! తమ ఆజ్ఞను శిరసావహించడానికి నేను సిద్ధంగా ఉన్నాను. మీరు చెప్పిన పనిని జయప్రదం చేయగల నన్న విశ్వాసం నాకున్నది. ఆజ్ఞాపించండి. ఈ క్షణమే తక్షశిలకేసి సైన్యంతో బయలుదేరు తాను!" అన్నాడు.

"చాలా సంతోషం, నాయనా! నీ ధైర్యాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ అభినందిస్తున్నాను. త్వరగా విజయయాత్రకు సిద్ధంకా!" అని బిందు సారుడు అశోకుడి వెన్ను చరిచి, మిగిలిన కుమారులకేసి తిరిగి "పిరికిపందల్లారా! ఇంకా నా ఎదుట ఎందుకు నిలబడ్డారు? మీ నివాసాలకు వెళ్ళి దాగుడుమూతలాడు కుంటూ, వెన్నదొంగిలించి ఎలుకల్లా తింటూ కాలం వెళ్ళబుచ్చండి," అని గద్దించాడు.

అయిదుగురు రాకుమారులూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు. అశోకుడు తండ్రి పాదాలకు నమస్కరించి, ఆయన ఆశీస్సులు పొంది అక్కడినుంచి బయలుదేరాడు.

"పూజ్య గురుదేవులు చాణక్యుడి మాటలు అక్షరాలా నిజమయినై. నా కుమారులందరి లోకీ అశోకుణ్ణే ఆయన సమర్థుడిగా గుర్తిం చాడు," అన్నాడు, బిందుసారుడుఏదోతీవ్రంగా ఆలోచిస్తూ ప్రధానమంత్రితో. –(ఇంకావుంది)






# మృణాళిని కోరిక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్నిదించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, లోకంలో దుష్టులకూ, మోసగాళ్ళకూ, నయవంచకులకూ కొదువ లేదు. వివేకవంతులు తప్పనిసరి పరిస్థితు లలో అలాటి వాళ్ళతో వ్యవహరించవలసివచ్చి నప్పుడు, తగు జాగ్రత్తలో వుండాలి. అలా కానప్పుడు, వాళ్ళ వాక్చాతుర్యానికి సమ్మో హితులై వంచనకు గురికావడంజరుగుతుంది. ఇందుకు స్త్రీ పురుషులన్న భేదభావం ఏమీ లేదు. కన్ను పొడుచుకున్నాకానరాని, ఈశ్మశా నపు గాఢాంధకారంలో ఇక్కట్ల పాలవుతున్న నీకు హెచ్చరికగా వుండేందుకు, ఒక గంధ ర్వుడివల్ల వంచనకుగురైన మృణాళిని అనే రాకుమారి కథ చెబుతాను, శ్రమ తెలియ కుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



మణికంఠుడు అనే గంధర్వుడికి భూలోకం చూడాలన్న కోరిక కలిగింది. అతడు ఒక పున్నమిరాత్రి ఆకాశగమనం చేస్తూ, భూలోకం కేసివచ్చాడు. ఆ సమయంలో వైదేహియువరాణి మృణాళిని, రాజభవనం సమీపానగల ఉద్యానంలో చెలికత్తెలతో విహరిస్తున్నది.ఆమె సౌందర్యం చూసిన మణికంఠుడు అచ్చెరువందాడు. అంతటి సౌందర్యరాశిని అతడు గంధర్వలోకంలో కూడా అంతకు ముందెన్నడూ చూసి ఎరగడు.

మణికంఠుడు, యువరాణితో మాట్లాడాలన్న కోరికతో ఆకాశం నుంచి ఉద్యానంలో దిగి, ఆమెఎదుటపడి, "ఓ,అద్భుత సౌందర్యరాశీ! ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు.

మృణాళిని అతణ్ణి చూసి ఆశ్చర్యపోతూ, "నేను వైదేహియువరాణిమృణాళినిని. చీమ కూడా జొరబడలేనంత కట్టుదిట్టంగా వున్న, ఈ ఉద్యానంలోకి మీరెలా రాగలిగారు?" అన్నది.

"నేను మణికంఠుడనే గంధర్వుడను. గగనతలాన విహరిస్తూ, నీ అందం చూసి ఇక్కడ దిగాను," అన్నాడు మణికంఠుడు.

ఆ జవాబుకు యువరాణి బెదురుగా దిక్కులు చూసి, "మీరు త్వరగా ఇక్కడినుంచి వెళ్ళండి. భటులు చూస్తే బంధించగలరు," అన్నది.

"గంధర్వుడనైన నాకున్న అద్భుతశక్తులు నువ్వెరగవు!" అంటూ మణికంఠుడు గాలిలో చేయితిప్పాడు.

ఆ మరుక్షణం యువరాణి చెలికత్తెలు, కాపలాభటులు స్పృహకోల్పోయారు.

ఇది చూసి యువరాణి, "మహాద్భుతం!" అన్నది చిరునవ్వు నవ్వుతూ.

ఆ మాటలకు గంధర్వుడు ఎంతగానో ఆనందించి, "సుందరీ! ఇంత హఠాత్తుగా అడుగుతున్నానని కోపగించకు. నిన్ను వివాహమాడాలన్న కోరికను దాచలేకపోతున్నాను," అన్నాడు.

మృణాళిని, అతణ్ణి ఒకసారి పరీక్షగా చూసి తలవంచుకుని,"మా తండ్రి నా వివాహానికి చాలాకాలంగా ప్రయత్నాలు చేస్తున్నాడు. అయితే, ఎవరూ నాకు తగినవరుడుగా కనిపించలేదు. ఇప్పుడు మిమ్మల్ని ఎన్నుకుంటున్నాను. కాని, మన వివాహానికిముందు, మీరొక కష్టతరమైన కార్యం సాధించవలసి వుంటుంది.!" అన్నది.

"ఏమిటది?" అన్నాడు మణికంఠుడు కుతూహలంగా.

"వీరసేనుడనే పొరుగురాజు, నన్ను వివాహమాడాలన్న పట్టుదలలో వున్నాడు. నాకు అతడంటే అవగింజ మాత్రం ఇష్టం కూడా లేదు. అతడు, మా తండ్రిగారిపై యుద్ధ ప్రయత్నాల్లో వున్నాడు. మా కన్న అతడి సైనికబలం పెద్దది. మీరతన్ని ఓడించ గలిగితే, మిమ్మల్ని హృదయ పూర్వకంగా వివాహమాడగలను," అన్నది యువరాణి.

"అదెంతపని! నేనిప్పుడే మా లోకానికి పోయి, రాజు చిత్రవర్ణుడికి సంగతి చెప్పి వస్తాను," అంటూ మణికంఠుడు మాయ మయ్యాడు.

మణికంఠుడు ఒక భూలోకకాంతను వివాహమాడబోతున్నాడని తెలిసి, గంధర్వ రాజు చిత్రవర్ణుడు మండిపడ్డాడు. ఆయన, అతణ్ణి తీవ్రంగా శిక్షించాలని భావిస్తూండగా, ఒక నిజం తెలిసింది. చిత్రవర్ణుడి కుమార్తె కాంతిమయి, మణికంఠుణ్ణి ప్రేమించింది. అతణ్ణి వివాహమాడాలని కలలుకంటున్నది.

అప్పుడు చిత్రవర్ణుడు, మణికంఠుడితో, "గంధర్వులకు మానవులతో పొత్తుకుదరదు. నా కుమార్తె కోర్కెను తోసిపుచ్చకు," అని హితవు చెప్పబోయాడు.

అయితే, మణికంఠుడు ఆయన హితవు కాదని, తను యువరాణి మృణాళినినే వివాహమాడబోతున్నాననీ, అందుకు తిరుగు లేదనీ పట్టుబట్టాడు.

ఇందుకు చిత్రవర్ణుడు ఆగ్రహించి, "అలా అయితే, నీకు మరిక గంధర్వలోకంలో స్థానంలేదు. ఇక ముందు భూలోకంలోనే జీవించు. ఈ క్షణం నుంచి నీ మంత్రశక్తులు పనిచేయవు!" అని శపించాడు.



మణికంఠుడు ఏమాత్రం బాధపడకుండా భూలోకం చేరి, యువరాణి మృణాళినిని చూడబోయాడు. ఆమె ద్వారా మణికంఠుడి వృత్తాంతం విన్న వైదేహిరాజు చంద్రకేతుడు, అతణ్ణి సాదరంగా ఆహ్వానించి జరిగినదంతా తెలుసుకున్నాడు.

మణికంఠుడు, గంధర్వరాజు చేత శాప గ్రస్తుడైనట్టు తెలుసుకున్న మృణాళిని, "మరిక మీరు రాజు వీరసేనుణ్ణి ఎలా జయించ గలరు?" అని ప్రశ్నించింది.

"నాకు మంత్రశక్తులు లేకపోయినా, అపారమైన భుజబలంవున్నది! నిన్ను వివాహ మాడేందుకు ప్రాణాలకు తెగించి పోరాడి, ఆ వీరసేనుణ్ణి యుద్ధభూమిలో మట్టుపెట్ట గలను," అన్నాడు మణికంఠుడు పౌరు షంగా.

ఆ తర్వాత నెల తిరక్కుండానే అతడు, చంద్రకేతుడి సైన్యానికి నాయకత్వం వహించి పోయి, రథం మీద ముందుండి రాజు వీర సేనుడి కోటనుముట్టడించాడు.

వీరసేనుడు కూడా మహాపరాక్రమశాలి. అతడికీ మణికంఠుడికీ మధ్య తీవ్రమైనపోరు జరిగింది. సైనికులు తమ తమ నాయకులకు అండగా నిలిచి పోరాడసాగారు.

ఆ సమయంలో వీరసేనుడు విసిరిన ఈటె ఒకటి సూటిగా వచ్చి, మణికంఠుడి తలను తాకబోయింది. అంతలో ఒక సైని కుడు మెరుపువేగంతో ఎగిరి ఈటెకు అడ్డుగా వచ్చాడు. ఈటె అతడి భుజాన్ని తాకింది. ఆ సైనికుడికేసి చూసిన మణికంఠుడికి, అతడి నెక్కడో చూసినట్లనిపించింది.

మణికంఠుడు వీరావేశంతో, రథంలోని విల్లంబులు అందుకుని, వీరసేనుడి మీద బాణవర్షం కురిపించాడు. బాణాల్లో ఒకటి వీరసేనుడి గుండెలను బలంగా తాకింది. ఆ దెబ్బకు అతడు పెద్దగా అరిచి, రథంనుంచి జారి కిందపడిపోయాడు. ఇది చూసి అతడి సైనికులు భీతిల్లి చెల్లా చెదురుగా పారి పోయారు.

మణికంఠుడు వెంటనే రథం దిగి, తన ప్రాణాన్ని కాపాడిన సైనికుడి కోసం వెదుకుతూ బయలుదేరాడు. గాయపడిన సైనికులున్న ఒక శిబిరంలో అతడు కనిపించాడు. అతడి శిరస్త్రాణం పక్కకు ఒరిగి వున్నది. చూస్తూనే ఆ వ్యక్తిని గుర్తించి మణికంఠుడు నిశ్చేష్టు డయ్యాడు. గంధర్వరాజు కూతురు కాంతి మయి,సైనికుడివేషంలో వచ్చి తనను కాపా డిందని గ్రహించాడు.

అతడు వెంటనే సపర్యలు చేసి ఆమెకు స్పృహ కలిగించాడు. కాంతిమయి కళ్ళు తెరుస్తూనే మణికంఠుణ్ణి చూసి తలవాల్చు కున్నది.మణికంఠు డామెను, "ఇదేమిటి,



కాంతిమయీ! నిన్ను కాదన్న వాడి కోసం ఇంతటి త్యాగంచేయడమా?" అన్నాడు. జీరబోయిన గొంతుతో.

అందుకామె, "నువ్వులేని లోకంలో వుండ లేక, కనీసం నిన్ను చూసుకుంటూ అయినా బతుకు సాగించవచ్చని భూలోకం చేరాను. మంత్రశక్తులులేని నువ్వు, బలవంతుడైన వీరసేనుడితో యుద్ధానికి దిగినప్పుడు నీకే మైనా హానిజరగవచ్చని, నిన్ను వెన్నంటి వున్నాను. నా మంత్ర శక్తులతో అతణ్ణి జయించ వచ్చు. కానీ నీ భుజబలంతో నువ్వు నీ ప్రియురాల్ని దక్కించుకున్న తృప్తి నీకు మిగల్చాలని అలా చేయలేదు. నిన్ను కాపాడానన్న తృప్తి, నాకుచాలు. వెళ్ళి మృణాళినిని వివాహమాడి సుఖంగా వుండు," అన్నది.

మణికంఠు డామెకు తన కృతజ్ఞతలు చెప్పుకుని అక్కడినుంచిపోయి మృణాళినిని కలిశాడు. రాజు చంద్రకేతుడు, వీరసేనుణ్ణి ఓడించినందుకు అతణ్ణి అభినందించాడు. మృణాళిని పరమానందభరితురాలైపోయి, అతడితో, "ఇక మన వివాహం జరిగిపోయి నట్టే! వివాహం అయ్యాక మీరు, నా మరొక కోర్కె తీర్చాలి," అన్నది.

"ఏమిటా కోరిక?" అని అడిగాడు మణి కంఠుడు.

"అదేమంత పెద్ద కోరిక కాదు. మీ భుజ బలం, ధనుర్విద్యాప్రావీణ్యం సాటిలేనివి. మీరుఇరుగుపొరుగు రాజ్యాలన్నిటినీజయించి చక్రవర్తి కావాలి. అప్పుడే నేను అందరిచేతా మహారాజ్ఞిగా గౌరవమన్ననలు పొందగలను," అన్నది మృణాళిని.

ఆ వెంటనే మణికంఠుడు తీవ్రస్వరంతో, "క్షమించు, యువరాణీ! నేను నిన్ను వివాహ మాడలేను," అంటూ అక్కడినుంచివడివడిగా వెళ్ళిపోయాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఆఖరి క్షణంలో మణికంఠుడి ప్రవర్తన విడ్డూరంగా లేదా? ఉద్యానంలో చెలికత్తెల వెంట తిరుగుతున్న మృణాళిని ముందు, మరోలోకం నుంచి వచ్చి ప్రత్యక్షమైన మణికంఠుడు, తనకు తానుగా ఆమెను వివాహమాడగోరాడుగదా? అందుకోసం అతడు గంధర్వ రాజు కుమార్తె ప్రేమను కూడా కాదన్నాడు. ఆ రాజుచేత శాపగ్రస్తుడుకూడా అయ్యాడు. మృణాళినిని, అద్భుతసౌందర్యరాశీ, సుందరీ అంటూ తన వాక్చాతుర్యం ప్రదర్శించి వివాహానికి అంగీకరింపచేశాడు. ఇంత జరిగాక, తుదిక్షణంలో నిన్ను వివాహమాడలేను, అని తన దారిన తానుపోవడం వంచన కాదా? ఒకవేళ అతడు, గంధర్వ రాజు శాపకారణంగా తనకున్న మంత్రశక్తులతో పాటు వివేక ఇంగితజ్ఞానాలను కూడా కోల్పోయి వుంటాడా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో, ఈ క్షణమే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "యువరాణి మృణాళిని కోసం మణికంఠుడు ఎంతో త్యాగం చేశాడు. ఆమెను వంచన చేయదలచిన వాడైతే అంతగొప్ప త్యాగానికి పూనుకోడు. ఆమెను వివాహమాడేందుకు, యుద్ధంలో తన ప్రాణాలను పణంపెట్టి, తనను కాపాడిన కాంతిమయిని కూడా కాదన్నాడు. అలాంటి వాణ్ణి వివాహమాడడానికి ఇష్టం తెలుపుతూనే, మృణాళిని అతణ్ణి పొరుగు రాజ్యాలను జయించమనీ, అప్పుడు తను మహారాజ్ఞిగా అందరిచేతా గౌరవమన్ననలు పొందగలననీ చెప్పింది. తనలోని మానవత్వానికి సంపూర్ణంగా తిలోదకాలిచ్చినవాడు తప్ప, కానివాడెవడూ అకారణంగా పొరుగు రాజుల పైకి యుద్ధానికి పోయి రక్తపాతం కలిగించి చక్రవర్తి కావాలని కోరడు. అందువల్లనే, మణికంఠుడు, కాంతిమయిలోని త్యాగబుద్ధినీ, మృణాళినిలోని స్వార్థబుద్ధినీ గుర్తించి ఆమెను వివాహమాడేందుకు నిరాకరించాడు," అన్నాడు

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ ఆధారం: ఎన్. శివనాగేశ్వరరావు రచన ]





# రాజవైద్యుడికి వైద్యం

భూపాళరాజుగారి ఆస్థానవైద్యుడికి జబ్బు చేసింది. వారంరోజులు గడిచినా, ఆయన ఎక్కిన మంచం దిగలేదు. మహారాజు ఈ విషయం మంత్రితో ప్రస్తావిస్తూ, "మన రాజ వైద్యుడికి సొంత మందులు పనిచేస్తున్నట్టు లేదు. ఎవరైనా మరొక వైద్యుడిచేత పరీక్ష చేయిస్తే మంచిదేమో!" అన్నాడు.

ఇందుకు మంత్రి సాలోచనగా, "ప్రభూ! మన రాజ్యంలో వైద్యులకేమీ కొదువలేదు. వారిలో ఎవరిని మనం, ఆస్థానవైద్యుడికి చికిత్స చేయమని ఆదేశించగలం? మనకు వైద్యుల్లో ఎవరి శక్తిసామర్థ్యాలెలాంటివో తెలియదు. అందువల్ల, ఈ విషయమై ఒక ప్రకటన చేద్దాం. అప్పుడు, అనుభవజ్ఞుడూ,తన చికిత్సావిధానంపట్ల పరిపూర్ణమైన విశ్వాసం గలవాడూ ముందుకురావచ్చు," అన్నాడు.

రాజు సరేనన్నాడు. అయితే, మంత్రి చేయించిన ప్రకటన విన్న వైద్యుల్లో ఏ ఒక్కరూ ఆస్థానవైద్యుడికి చికిత్స చేసేందుకు రాలేదు.

అపరధన్వంతరిలాంటి ఆస్థానవైద్యుడికి తెలియని వైద్యరహస్యాలు ఏముంటాయి! ఆయనకు చికిత్స చేయడానికి మనమెంత వాళ్ళం. అహంకరించి వైద్యం చేస్తామంటూ వెళ్ళి, ఇచ్చిన మందులు బెడిసికొట్టడంజరిగితే మనకు ఉరిశిక్షో, ఖైదో తప్పదు! అనుకుని, ఏ వైద్యుడూ ముందుకు రాలేదు.

ఈ పరిస్థితుల్లో, దయానందశర్మ అనే వైద్యుడు, ఆస్థానవైద్యుడికి చికిత్స చేస్తానంటూ వచ్చి మంత్రిని కలుసుకున్నాడు. ఆయన అతణ్ణి, ఆస్థానవైద్యుడి దగ్గరకు పంపాడు.

ఆస్థానవైద్యుడు, దయానందశర్మను కొన్ని ప్రశ్నలడిగి, "ఇంతకూ నీకు వైద్యం నేర్పిన గురువుగారెవరు?" అన్నాడు.

శర్మ చేతులు జోడించి, "వైద్యాచార్యా! నేను మణిశంకరుల వారి శిష్యుణ్ణి. వారు

ఇంద్రగంటి నరసింహమూర్తి

తమను గురించి చెప్పగా విన్నాను. ఇరువురూ ఒకే గురుకులంలో విద్యాభ్యాసం చేశారట!" అన్నాడు.

తన సహాధ్యాయి పేరు వింటూనే ఆస్థాన వైద్యుడి నేత్రాలు మెరిసినై. ఆయన ఉత్సాహంగా, "ఆహాఁ, వాడికి నేనింకా గుర్తున్నానన్న మాట! చాలా సంతోషం. ఒకవేళ వాడునిన్ను నా దగ్గరకు పంపలేదు గద?" అని అడిగాడు.

"అలాంటిదేం లేదు, ఆచార్యా! ఇప్పటికి నెలరోజుల క్రితం నా విద్య పూర్తయిందని చెప్పి, ఆచార్యులవారు నన్ను గురుకులం నుంచి పంపేశారు. నా స్వగ్రామం రాజధానికి రెండామడలదూరంలోవున్నది. అక్కడ వైద్య వృత్తి ప్రారంభించాలని ఆలోచిస్తూండగా, తమ అస్వస్థత గురించి తెలిసింది; రెక్కలు కట్టుకుని మరీ వచ్చాను," అన్నాడు.

శర్మ జవాబుకు ఆస్థానవైద్యుడు చిరునవ్వు నవ్వి, "అంటే – నేను నీపాలబడిన ప్రప్రథమ రోగినన్నమాట! సరే, ఆ పరీక్షలేవోచేసి చికిత్స ప్రారంభించు. వైద్యంలో నా అంత ప్రతిభాశాలి అయిన, నా సహాధ్యాయి మణిశంకరుడిశిష్యుడివి గనక, నీలో నాకు పూర్తి విశ్వాసంవున్నది," అన్నాడు.

ఎవరూ ఊహించనివిధంగా, శర్మచేసిన చికిత్సతో రాజవైద్యుడు వారంరోజుల్లో ఎప్పటిలా ఆరోగ్యవంతుడయ్యాడు.

ఈ విషయం విన్న రాజు, మంత్రితో, "మన ఆస్థానవైద్యుడంతటివాడికే చికిత్స చేసి వ్యాధి కుదిర్చాడంటే ఈ యువవైద్యుడు ఆయనకన్న ప్రతిభావంతుడని తెలుస్తున్నది గదా! ఆయనను విశ్రాంతి తీసుకోమనిచెప్పి, ఈ శర్మను ఆస్థానవైద్య పదవిలో నియమించడం ఎలా వుంటుంది?" అని అడిగాడు.

"మహాప్రశస్తంగా వుంటుంది, ప్రభూ," అని మంత్రి అప్పటికప్పుడు శర్మను పిలిపించి సంగతి చెప్పాడు.

శర్మ అందుకంగీకరించక, "తమ రాజవైద్యుడికి తెలియని వైద్యరహస్యం గాని, చికిత్సావిధానంగాని మరి లేదు. ఇతరులకు ధైర్యంగా మందులిచ్చే వైద్యులు, సర్వసాధారణంగా తమకు చికిత్స చేసుకోవలసి వచ్చినప్పుడు తడబడతారు. రాజవైద్యుల విషయంలో అదే జరిగింది!" అన్నాడు.

శర్మ వివరణకూ, వినయగుణానికీ ఎంతో సంతోషించిన రాజు, అతణ్ణి ఆస్థానవైద్యుడికి సహాయకుడుగా నియమించి గౌరవించాడు.



## సముద్రతీర ప్రయాణాలు–17

# దక్షిణభారత సింహద్వారం




రచన:మీరానాయర్ ✯ చిత్రకారుడు: కె.ఎస్. గోపకుమార్

కోరమండల్ తీరం గుండా మరికొంత దూరం ఉత్తరంగా వెళ్ళామంటే పల్లవుల ప్రాచీన రేవుపట్టణమైన మామల్లపురం చేరుకుంటాం. 7వ శతాబ్దానికి చెందిన పల్లవరాజు నరసింహవర్మకు మామల్లుడు అనే బిరుద నామం ఉండేది. ఆయన కాలంలోనే మామల్లపురం నిర్మించబడి, ఉచ్ఛస్థితిలో ఉండేది. ఆయన పేరు మీదుగానే దీనికి మామల్లపురం అనే పేరువచ్చింది. క్రమేణా అది మహాబలిపురంగా మారింది. పల్లవుల సుప్రసిద్ధమైన రేవు, సముద్ర గర్భంలో కలిసిపోయింది. కాని, వారి కాలంలో చెక్కబడిన బ్రహ్మాండమైన రాతిశిల్పాలు ఈ నాటికీ చెక్కుచెదరకుండా చూపరులకు ఆనందాశ్చర్యాలు కలిగిస్తున్నాయి. అవి నాటి పాలకుల కళాభిరుచిని, కళాపోషణను చాటుతున్నాయి.

ఇక్కడున్న రాతిశిల్పాలలో ముఖ్యమైనది అర్జునుడి తపస్సు లేదా గంగావతరణం. ఇది 29 మీ. పొడవు, 13 మీ ఎత్తు గల రాతిలో ఉబ్బెత్తుగా మలచబడిన శిల్పసముదాయం. ఈ రకం రాతి శిల్పాలలో ప్రపంచంలో కెల్లా ఇదే అతి పెద్దదని చెబుతారు. ఋతుపవనాల సమయంలో వర్షం నీరు రాతి శిల్పానికి మధ్య ఉన్న రంధ్రం గుండా కిందికి ప్రవహిస్తుంది. ఇది ఆకాశం నుంచి భూమికి దిగిన పురాణ  గంగావతరణ దృశ్యాన్ని తలపిస్తుంది.



అర్జునుడి తపస్సు



సుప్రసిద్ధమైన రాతిరథాలు

మామల్లపురంలోని బండలలో తొలచబడిన ఆలయాలలో రాతి రథాలు చాలా ప్రసిద్ధమైనవి. అవి రథాకారాలలో మలచబడి ఉన్నాయి. వీటికి ధర్మరాజు, అర్జునుడు, భీముడు, సహదేవుడు, ద్రౌపది రథాలని పేర్లు పెట్టారు.

బండలమీది శిల్పసముదాయానికి తూర్పుగా వరాహ, మహిషాసురమర్దినీ గుహలు ఉన్నాయి. ఇక్కడ కొన్ని పురాణకథలు శిల్పాలుగా చెక్కబడి ఉన్నాయి.

మహావిష్ణువు వరాహ అవతారమెత్తి హిరణ్యాక్షుడి బారినుంచి భూదేవిని రక్షించిన కథ, వరాహ గుహలోని ఒక బండ మీద చెక్కబడి ఉన్నది.

మహిషాసురమర్దినీ గుహలో రెండు శిల్ప ఫలకాలు ఉన్నాయి. ఒక దానిలో మహిషాసుర సంహార గాథ చెక్కబడింది. మహిషాసురుడు మితిమించిన అహంకారంతో ఇంద్రాది దేవతలను స్వర్గం నుంచి తరుమగొట్టాడు. వాడి దుర్మార్గాన్ని దేవతలు భరించలేకపోయారు. దేవతలందరూ గుమిగూడి తమ దివ్యశక్తులతో అంబిక (దుర్గ)ను సృష్టించారు. దుర్గామాత దేవతలందరి శక్తులనూ పొంది,వివిధ ఆయుధాలను ధరించి, మహిషాసురుడి మీదికి వెళ్ళి, వాడితో యుద్ధం చేసి హతమార్చింది. అందువల్ల ఆమెకు మహిషాసురమర్దిని అనే సార్థకనామమేర్పడింది. దుర్గా నవరాత్రుల సమయంలో ఆమెను ఈ రూపంతోనే పూజిస్తారు. మహిషపుతల గల రాక్షసుడి మీదికి సింహారూఢయైన దుర్గ ఉరుకుతూన్న భంగిమలో మహిషాసురమర్దినీశిల్పం చెక్కబడి ఉన్నది.

దానికి ఎదురుగా యోగనిద్రలో ఉన్నమహావిష్ణువురూపం చెక్కబడి ఉన్నది.

సముద్రతీరంలో గంభీరమైన జలశయనతీరమందిరంఉన్నది. ఆలయానికి ముందు వైపున



జలశయన (తీర) మందిరం

సముద్రపు అలలతాకిడి ఉండడం వల్ల, వెనుక వైపునుంచే ఆలయంలోపలికి వెళ్ళడానికి వీలవుతుంది. ఇది ఒక వైష్ణవ ఆలయం. ఆలయం ప్రహరీగోడ మీద కొన్ని నంది విగ్రహాలు ఉన్నాయి.

మహాబలిపురానికి ఉన్న మరొక విశిష్టత ఏమంటే– 5వ శతాబ్దానికి చెందిన భూతత్తాళ్వారుఅనే వైష్ణవ భక్తకవి ఇక్కడే జన్మించాడు.



మనదేశంలోనే ఎత్తయిన పతాక స్తంభం

పల్లవుల కీర్తిని చాటుతూన్న మహాబలిపురాన్ని దాటి మరికొంతదూరం ముందుకు వెళ్ళామంటే చోళమండలం కళాకారుల గ్రామాన్ని చేరుకుంటాం. ఆధునిక కళాకారులు కొందరు ఈ ప్రశాంత ప్రదేశంలో నివాసం ఏర్పరచుకున్నారు. ఇక్కడి కళాకారులు తాము సృష్టించిన కళాఖండాలను అమ్మి ఆ ఆదాయంతో జీవనం సాగిస్తున్నారు. వర్ణచిత్రాలు, గీతచిత్రాలు, టెర్రకోట శిల్పాలు, మరెన్నో కళాఖండాలను ఇక్కడ ప్రదర్శనకు ఏర్పాటు చేసి ఉన్నారు. కవి సమ్మేళనాలు, నృత్య ప్రదర్శనలు కూడా ఇక్కడ అప్పుడప్పుడు జరుగుతూ ఉంటాయి.

చోళమండలం కళాకారుల గ్రామం దాటి ముందుకు వెళ్ళామంటే మద్రాసు మహానగరంగా ప్రసిద్ధి గాంచిన ఒకనాటి చెన్నపట్టణం నేటి చెన్నయ్ నగరం చేరుకుంటాము. తమిళనాడు రాష్ట్ర రాజధాని అయిన చెన్నయ్ మనదేశంలోని నాలగవ అతిపెద్ద నగరం. ఇది కోరమండల్ తీరంలో 17కి.మీ. దూరం విస్తరించి ఉన్నది. దీనిని దక్షిణభారత సింహద్వారంగా చెబుతారు.

పదిహేడవ శతాబ్దంలో బ్రిటిష్ వాళ్ళు కోర మండల్ తీరంలో ఇప్పటి మద్రాసుకు దాదాపు 40.కి.మీ ఉత్తరంగా ఆర్మగాం కర్మాగారం నిర్మించాలనుకున్నారు. కాని ఆ తరవాత అది వర్తక వ్యాపారాలకు అనువైన ప్రాంతం కాదని భావించడం వల్ల ఆర్మగాం ఫ్యాక్టరీ అధికారి అనువైన స్థలం కోసం వెతుకుతూ దక్షిణంగా ప్రయాణం–సాగించాడు. ఆఖరికి




కోట మ్యూజియం

1639వ సం|| జూలై 22వ తేదీ దామర్ల వెంకటాద్రి నాయకుడి ద్వారా చంద్రగిరి రాజు నుంచి మద్రాస్ కుప్పం అనే సముద్రతీర పల్లెకారు గ్రామప్రాంతాన్ని కొన్నాడు. నరిమేడు (నక్కలమిట్ట) అని అప్పటి స్థానికుల చేత పిలువబడిన బంజరుభూమి క్రమక్రమంగా ప్రజలకు నివాసస్థానమై, ఈనాటి మద్రాసు మహానగరంగా అభివృద్ధి చెందింది.

బ్రిటిష్ ఫ్యాక్టరీని నిర్మించిన ఫ్రాన్సిస్ డే, ఫ్యాక్టరీ రక్షణకోసం వచ్చిన సైనికులకోసం కోటను నిర్మించాడు. కోట నిర్మాణం – సెయింట్ జార్జ్ (ఇంగ్లాండ్ పేట్రన్ సెయింట్) దినమైన (1640) ఏప్రిల్ 23వ తేదీ పూర్తికావడం వల్ల దీనికి సెయింట్ జార్జ్ కోట అని నామకరణం చేశాడు!

ఇక్కడి సెయింట్ మేరీ చర్చిని 1680లో నిర్మించారు. ఇది భారతదేశంలో నిర్మించబడిన మొట్టమొదటి ఆంగ్లికన్ చర్చ్. దేశంలోని పాతకాలపు సమాధిరాళ్ళను ఇక్కడ అమర్చారు. ఉత్తరోత్తరా అమెరికాలో విశ్వవిద్యాలయం స్థాపించిన గవర్నర్ ఎలిహూ యేల్ ఇక్కడే వివాహం చేసుకున్నాడు. ఈ చర్చిలో మొట్టమొదట జరిగిన వివాహం అది. మద్రాసు సిపాయిల పాత ఉడుపులు, ఈస్ట్ ఇండియా కంపెనీ మొట్టమొదటి సైనికదళం చిత్రాలు ఇక్కడ ప్రదర్శనకు ఉంచారు.

కోటలోని మ్యూజియంలో పలు చారిత్రాత్మకమైన పత్రాలూ, దస్తావేజులూ, తైలవర్ణ చిత్రాలూ, నాణాలూ, పతకాలూ, ఆయుధాలూ, శిల్పాలూ నగర ప్రారంభదశ విశేషాలను తెలియజేసే చిత్రాలూ ఉన్నాయి. ఈ భవనం 1683వ సం||లో నిర్మించబడింది. ఇక్కడ తొలిరోజులలో బ్యాంక్ ఆఫ్ మద్రాస్ ఉండేది. ఇదే మన దేశంలోని మొట్టమొదటి ఆధునిక బ్యాంక్. ఇది ఇంపీరియల్, స్టేట్‌బ్యాంకులకు మార్గదర్శి. దీనిపైభాగంలో వ్యాపారస్తులు మాట్లాడుకోవడానికి విశాలమైన గది; ఉపరితలంలో లైట్‌హౌస్ ఉండేవి.



సెయింట్ జార్జ్‌కోటలోని 50.మీ.ఎత్తయిన టేక్ కలప పతాక స్తంభం – మన దేశంలోనే చాలా ఎత్తయినది. తమిళనాడు రాష్ట్ర శాసన సభా భవనం; రాష్ట్ర ప్రధాన సచివాలయ భవనాలు సెయింట్ జార్జ్ కోటలోపలే ఉన్నాయి.

కోటకు సమీపంలో ఉన్న అందమైన మెరీనాబీచ్ ప్రపంచంలోనే రెండవ పొడవైన బీచ్‌గా పేరుగాంచింది. దీని పొడవు 3.5 కి.మీ. తమిళనాడు ముఖ్యమంత్రులలో కెల్లా చాలా ప్రసిద్ధుడైన సి.ఎన్. అణ్ణాదురై సమాధి ఇక్కడ ఉన్నది.

అనుచరులచేత 'అణ్ణా' అని అభిమానంతో పిలువబడిన సి.ఎన్. అణ్ణాదురై – తమిళనాడు రాజకీయ, సామాజిక రంగాలలో నూతన శకారంభానికి నాంది పలికాడు. ఆయన నాయకత్వం వహించిన ద్రావిడ మున్నేట్ర కళగం 1967వ సం||లో రాష్ట్రంలో అధికారాన్ని చేపట్టింది. కాని ఒక సంవత్సరంలోగానే 'అణ్ణా' కాలధర్మం చెందాడు. అది రాష్ట్ర ప్రజలకు దిగ్భ్రాంతిని కలిగించింది. లక్షలాది ప్రజలు సజలనయనాలతో ఆయనకు ఇక్కడ తుది వీడ్కోలు పలికారు. అణ్ణా సమాధి ఇవాళ ఒక యాత్రాస్థలంగా మారింది. రోజూ వందలాది మంది ఆయన సమాధిని దర్శిస్తారు.

అణ్ణా సమాధి



# నష్టంలో లాభం

పట్నంలో పుట్టి పెరిగిన మంగకు, పల్లెలో పొలం పనులు చేసుకునే శేఖరుడితో పెళ్ళి జరిగింది. శేఖరుడు చదువుపూర్తిచేసి ఉద్యోగ ప్రయత్నంలోవుండగా, హఠాత్తుగా తండ్రిపోవ డంతోకుటుంబ బాధ్యతలు అతనిపై పడ్డాయి. అతడికిఆరోగ్యంఅంతంతమాత్రంగా వుండే తల్లి, పెళ్ళికావలసిన చెల్లెలు వున్నారు. ఇందువల్ల, అతడు ఉద్యోగంచేసే ఆలోచనమాని, సొంతవ్యవసాయం చూసుకోవడం ప్రారంభించాడు.

మంగకు పల్లెటూరిజీవితం బొత్తిగానచ్చలేదు. ఆమె కాపురానికి వచ్చి నాలుగునెలలు గడిచేసరికి, "గాలీ, వెలుతురూరానికొంప. లోపల బొద్దింకలూ, ఎలుకలూ! సాయంత్రం అలా వెళ్ళి రావాలంటే, రామాలయం తప్ప మరొకచోటు లేదు. ఇక్కడ మరొక ఆరునెలలుంటే, నాకు పిచ్చెక్కడం ఖాయం!" అంటూ భర్త దగ్గర తన అసంతృప్తి కనబరచేది.

"నేను పాతికేళ్ళుగా ఎంతో సుఖంగా, ఈ ఇంట్లో వుంటున్నాను. పట్నవాసం నుంచి వచ్చిన నీకు, ఇక్కడి పరిస్థితులకు అలవాటు పడడానికి కొంత సమయం పడుతుందిలే!" అంటూండేవాడు శేఖరుడు.

అయితే రోజులుగడిచేకొద్దీ మంగలో అసంతృప్తి పెరిగిపోసాగింది. ఇటువంటి సమయంలో స్నేహితురాలి పెళ్ళికి పట్నం వెళ్ళివచ్చిన ఆమెలో, ఆ పల్లెపట్ల, ఆ ఇంటి పట్ల అసహ్యం రెట్టింపయింది.

ఎలాగైనా కాపురాన్ని పట్నానికిమార్చాలన్న పట్టుదలతో, మంగ పుట్టింటికి వెళ్ళి,తండ్రితో, "నాన్నా! నువ్వు తల తాకట్టు పెట్టయినా,మా ఆయనకు పట్నంలో ఉద్యోగం చూడు! ఆ దిక్కుమాలిన పల్లెలో బతకడం, నావల్లకాదు," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

ఆమెతండ్రి, తన స్నేహితుడి ద్వారా ప్రయత్నంచేసి, పట్నానికి సమీపంలో వున్న

మాచిరాజు కామేశ్వరరావు



పెద్ద ఊరిలో శేఖరుడికి ఉద్యోగం ఇప్పిం చాడు.

తండ్రి ద్వారా ఈ వార్త విన్న మంగ, ఆ రాత్రి భర్తకు భోజనం వడ్డిస్తూ, "ఇక మీరు మూటాముల్లే సర్దండి. రెండు రోజుల్లో ఈ పల్లె నుంచి మనకు విముక్తి!" అన్నది.

శేఖరుడికి, ఆమె చెప్పింది అర్థంకాలేదు. మంగ అతడికి అంతా వివరంగాచెప్పి, "ఈ పల్లెటూరిలో మట్టిపిసుక్కునే ఖర్మ మీకు తప్పించాడు, మా నాన్న!" అన్నది గొప్పగా.

శేఖరుడు కొద్దిసేపుఆలోచించి, "అంతా మన మంచికే అంటారు! పట్నంలో అమ్మకు వైద్యం బాగా జరుగుతుంది. మనం వెళ్ళనున్న ఊరుకు పట్నం దగ్గరే కదా! పోతే, చెల్లెలికి సంబంధాలు కూడా సులువుగా కుదరవచ్చు. పొలం కౌలుకిచ్చి వెళ్ళిపోదాం," అన్నాడు.

ఆ మాటలకు గతుక్కుమన్న మంగ సర్దుకుని, "మీ తెలివి తెల్లవారినట్టేవుంది! పొలంకౌలుకిస్తేఆదాయం తగ్గిపోతుంది. మీ అమ్మా,చెల్లీ ఇక్కడేవుండి పనివాళ్ళసాయంతో పొలం పనులు చూసుకుంటారు. మీ చెల్లి పెళ్ళికి డబ్బు కూడబెట్టవద్దామరి!" అన్నది.

శేఖరుడికి ఇష్టంలేకపోయినా, మంగ మొండిపట్టుదలకు తలవంచక తప్పలేదు. వ్యవసాయం తల్లికీ, చెల్లెలికీ అప్పచెప్పి, మంగతో ప్రయాణం అయ్యాడు.

మంగకు ఈ కొత్త ఊరు బాగా నచ్చింది. త్వరలోనే ఉద్యోగానికి అలవాటుపడ్డాడు, శేఖరుడు. ఒకసారి వినాయకచవితికి ఊరు వెళ్ళి, వాళ్ళు తిరిగి బయలుదేరబోతున్నప్పుడు, శేఖరుడి చెల్లెలు వాళ్ళతో, "దసరాకు మేం మీ ఊరువచ్చి, దీపావళి దాకావుంటాం.నాకు పట్నం చూడాలని వున్నది," అన్నది.

అయితే, అత్తా, ఆడపడుచులు వచ్చి అన్నిరోజులు తమ ఇంట వుండడం గిట్టని మంగ, దసరా పండగముందుఒంట్లో బాగా లేనట్టుగా నటించి, శేఖరుడితో, "మీ వాళ్ళను దీపావళికి రమ్మనండి. నలుగుర్ని కూచో బెట్టి చేసే ఓపిక నాకు లేదు," అన్నది.

విధిలేక, ఎవరిద్వారానో దీపావళినాటికి తల్లినీ, చెల్లెలినీ రమ్మని కబురు పంపించాడు, శేఖరుడు.

దీపావళి పండగ దగ్గిరపడింది. మంగ, శేఖరుడితో, "దసరాకు కొనుక్కున్నాను కాబట్టి, దీపావళికి నాకు పట్టుచీర వద్దు. నాలుగు వేలుపెట్టి చేతులకు గాజులుకొనండి,"అన్నది.

శేఖరుడు నవ్వి, "అలాగే కొంటాను. మొదటిసారి మన ఇంటికి వస్తున్న అమ్మకు

ఒక మంచి చీరా, చెల్లెలికి ఒక పట్టుచీరా కూడా కొంటాను" అన్నాడు.

"అవన్నీ మీ చెల్లెలు పెళ్ళినాడు కొనవచ్చు. మీ దగ్గర తగినంత డబ్బులేదేమోనని నేను గాజులు కొనమన్నాను. ఆ పట్టుచీర లేవో కొనే డబ్బుకూడా వేసి, నేను హారం కొనుక్కుంటాను," అన్నది మొండిగా.

శేఖరుడు ఎంతగానో భార్యకు నచ్చచెప్పాలనిచూశాడు. ఆమె ససేమిరా అతడి మాటలు వినలేదు. ఆ సాయంత్రమే ఇద్దరూ బాడుగ బండిలో పట్నం వెళ్ళారు.

ఒక నగల దుకాణంలో, అద్దాల వెనక వుంచిన హారం ఒకటి, మంగకు ఎంతగానో నచ్చింది. దుకాణం చాలా రద్దీగా వున్నది. మంగ హారం చూపి ధరెంత అని అడగగా, దుకాణంలోవున్న ఒకతను, హారం తూకం వేసి, "కాసు వెయ్యిరూపాయలు. ఈ హారం ఏడుకాసులది. ఏడువేలవుతుంది," అన్నాడు.

ఖరీదు జాస్తిగా వున్నా, ఆ హారమే కావాలని పట్టుబట్టింది, మంగ. చేసేదిలేక హారం తీసుకున్నాడు, శేఖరుడు. హారం చూపిన దుకాణంవాడు, కాస్తదూరంలో డబ్బు చెల్లించిన చీట్లురాస్తున్న వాడికేసి, "హారం ఏడు కాసులది!" అంటూ కేకపెట్టి, హారం పెట్టెలో పెట్టి మంగ చేతికిచ్చాడు.

హారం బరువు పొరబాటుగా విన్నాడో ఏమో డబ్బు చెల్లించిన చీట్లు రాసేవాడు, హారం బరువు మూడుకాసులదిగా రాసి, మూడువేలరూపాయిలకు చీటీరాశాడు.

జరిగిన పొరబాటు గ్రహించి, ఆ సంగతి దుకాణం వాళ్ళకు శేఖరుడు చెప్పబోతూంటే, "నీకేమయినా మతిపోయిందా? దీపావళి



లక్ష్మి ని కాదంటావా? మూడువేలుకట్టి త్వరగా పద. మిగిలిన నాలుగు వేలతో మరొకసారి వచ్చి గాజులు తీసుకోవచ్చు," అన్నదిమంగ. శేఖరుడు మూడువేలు చెల్లించి బయటకు వచ్చాక,"డబ్బుందికదా మా అమ్మకు, చెల్లెలికి చీరెలు తీసుకుందాం," అన్నాడు మంగతో.

"ఇంకానయం! నిన్ను నేను ఆపకపోయి వుంటే ఆ డబ్బు నగలదుకాణం వాడి గల్లా పెట్టెలో వుండేది. ఆ డబ్బునాది, దానిమీద నీ పెత్తనం ఏమిటి?" అన్నది మంగకోపంగా. శేఖరుడేం మాట్లాడలేకపోయాడు.

అయితే, తీరా ఇంటికి వెళ్ళి చూసుకుంటే, హారం కొక్కెం తెగిపోయేలా వుంది. మర్నాడు దానికి అతుకుపెట్టించడానికి మంగ, శివ లింగాచారి దగ్గరకు తీసుకుపోయింది.ఆచారి, హారాన్ని అటూ ఇటూ తిప్పి చూసి, "పూత

బంగారంహారానికి అతుకుపెట్టడమేమిటి? విడ్డూరం అంటే ఇదే!" అన్నాడు.

మంగకు నెత్తిన పిడుగుపడ్డట్టయింది. పట్నం నగలకొట్టువాడు, తమను నిలువునా మోసం చేశాడు! ఆ సాయంత్రమే ఆమె, భర్తతోపట్నం బయలుదేరి వెళ్ళింది. హారం అంటగట్టిన కొట్టువాణ్ణి చూస్తూనే ఆమె కోపంతో ఊగి పోతూ, "ఎంతమోసం! ఎంత దగా! మిమ్మల్ని రక్షకభటులకు అప్పగిస్తాను," అంటూ హారాన్ని వాడి చేతికిచ్చింది.

కొట్టువాడు, హారానికేసి ఒకసారి చూసి, "ఇది మేం అమ్మింది కానేకాదు!" అన్నాడు. "కానేకాదా! ఇదిగో, మీరిచ్చిన చెల్లుచీటీ," అంటూ, వెంటతెచ్చిన చీటీ కొట్టువాడి కిచ్చింది, మంగ. కొట్టువాడు హారం తూకం వేసి, "చూశారా, ఇది ఏడుకాసులది! మేం అమ్మినహారంతూకంమూడుకాసులే.మమ్మల్ని మోసగించ వచ్చినందుకు, రక్షకభటుల్ని పిలవాల్సినవాణ్ణి, నేను," అన్నాడు.

హారంతూకం తక్కువ రాసియివ్వడం, ఇలా మోసగించేందుకే అని, ఆసరికి భార్యా భర్తలకు అర్థమైపోయింది. ఇక చేసేదేమీలేక ఇంటికి తిరుగుప్రయాణమయ్యారు. మంగ బాడుగబండి ఎక్కుతూ, "మూడువేల రూపా యల కష్టార్జితం గంగపాలయింది. వాళ్ళ నీచబుద్ధిని తలుచుకుంటేనే ఒళ్ళుమండి పోతున్నది," అన్నది తెగ ఆవేశపడిపోతూ.

శేఖరుడు చిన్నగానవ్వి, "చూడు, మంగా! ఏదో సామెత చెప్పినట్టు-నీ తప్పును నువ్వు గుర్తించలేకపోతున్నావు. నగలకొట్టువాళ్ళను ముందుగా మోసగించాలనుకున్నది, నువ్వు గదా! వాళ్ళనీచబుద్ధిని అసహ్యించుకుంటున్న నువ్వు, అత్త, ఆడపడుచులపట్ల నీ ప్రవర్తనను గురించి మరిచిపోతున్నావు. కొట్టువాళ్ళను గురించి నీ వనుకుంటున్నట్టే, నేనూ నిన్ను గురించి అనుకుంటే, మనకాపురం నిలుస్తుందా?" అన్నాడు సౌమ్యంగా.

ఆ మాటలతో మంగకు కళ్ళముందు పొరలుతొలగిపోయినట్టయింది. ఆమెబండిని చీరెలదుకాణందగ్గర ఆపించి శేఖరుడితో, "పండగకు అత్తయ్యగారికీ, మీచెల్లెలికీ మంచి చీరలు తీసుకుందాం, దిగండి!" అన్నది.

భార్యలో వచ్చినమార్పుకు ఎంతో ఆనంద పడ్డాడు, శేఖరుడు. నగలకొట్టులో మూడువేలు నష్టపోయినా, తనకు ఎంతో లాభం వచ్చినట్టు పొంగిపోయాడు.



# చందమామ బంగారు గడియలు-11





1.... బ్రహ్మాండమైన ఈ బౌద్ధ ఆలయ-పర్వతం?
ఇది క్రీ.శ. 800 సం॥నాడు నిర్మించబడింది. క్రీ.పూ. 1వ శతాబ్దంలో బౌద్ధమతం హీనయానం, మహాయానం అని రెండు శాఖలుగా విడిపోయింది. ఉదార బౌద్ధమత సిద్ధాంతంగా చెప్పబడే మహాయాన శాఖకు చెందిన ప్రపంచంలోనే అతి పెద్ద ఆలయం ఇది.

## ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం?

2.... బ్రతికి వున్న అతి ప్రాచీన వృక్షం?
900 సంవత్సరాలు జీవించాడని బైబిల్‌లో చెప్పబడిన మెథూసెలా పేరు ఈ వృక్షానికి పెట్టారు. సూదుల్లాంటి కొమ్మలుగల ఈ దేవదారువృక్షం వయసు 4,600 సంవత్సరాలు!



3.... క్లియోపాత్రా సూది?
దాదాపు 3,500 సంవత్సరాలకు పూర్వం నిర్మించబడిన బ్రహ్మాండమైన నల్లరాతి స్తంభం. సూర్య దేవాలయం కోసం దీనిని ఈజిప్టుకు చెందిన మూడవ ఫరోవాతుట్మోస్ క్రీ.పూ. 1475వ సం॥లో నిర్మించాడు.



4.... నిట్టూర్పుల వంతెన?
కాలువకు ఆవలివైపున వున్న జైలుకు ఖైదీలను ఈ వంతెన గుండా తీసుకు వెళ్ళేవారు. వెనక ఉన్న నగరాన్ని ఆఖరుసారిగా చూస్తూ ఖైదీలు గాఢంగా నిట్టూర్చేవారు.



## చిత్ర ప్రహేళిక



ఈ చిత్రాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూడండి. ఆలోచించండి. ఇందులోని లోపం తెలియ వస్తుంది.

## సాహస సముద్రయానం

నూతన సముద్ర మార్గాలను అన్వేషిస్తూ క్రిస్టఫర్ కొలంబస్ బయలు దేరిన 'శాంతా మేరియా' ఓడ చిత్రం ఇది.

## పిక్చర్ క్విజ్



1. ఇందులో 30కి మించిన త్రికోణాలు ఉన్నాయి. సరిగ్గా ఎన్ని ఉన్నాయో కనుగొన గలరా?



2. సమానమైన ఆరు చతురస్రాలు రూపొందించడానికి 17 అగ్గిపుల్లలు అమర్చ బడ్డాయి. 3 చతురస్రాలు మాత్రమే మిగిలేవిధంగా 5 అగ్గిపుల్లలను తొలగించండి చూద్దాం.

3. ఈ జంతువులలో వేటినుంచి మనకు దంతం లభిస్తుంది.



# సరదా ప్రశ్నలు

1. తన దగ్గర గాలిలేని టైరు ఉందన్న విషయం తెలియకుండానే, ఒక మనిషి ఢిల్లీ నుంచి ఆగ్రా వరకు కారును నడిపాడు. అది ఎలా సాధ్య మయింది?

2. ఒక కుక్కను ఒక మీటరు పొడవుగల దారంతో కట్టారు. అయినప్పటికీ ఆ కుక్క మూడు మీటర్లు అవతల పడివున్న ఎముకను సులభంగా అందుకో కల్గింది. అది ఎలా?






3. ఒక దొంగ, తాను దొంగిలించిన కారును తెచ్చి, వరుసగా వున్న ఈ కార్ల పక్కన వదిలేసి పారిపోయాడు. కొంత సేపయ్యాక ఇన్‌స్పెక్టర్ రామం అక్కడికి వచ్చాడు. దొంగ కారును అక్కడ వదలడం ఆయన చూడలేదు. కాని ఆ కారును గుర్తించ గలిగాడు. అది ఎలాగో ఊహించ గలరా

4. ఒక మూగ చెవిటి వాడు సుత్తి కొనడానికి ఇనుప సామాను లమ్మే దుకాణానికి వెళ్ళాడు. అతడు మాట్లాడలేడు గనక, సుత్తితో కొడుతున్నట్లు అభినయించాడు. దుకాణాదారు అతనికి ఏం కావాలన్నదీ అర్థం చేసుకున్నాడు. మరొక మూగ చెవిటి వాడు స్క్రూడ్రైవర్ కొనడానికి అదే దుకాణానికివెళ్ళి, మరను తిప్పే పద్ధతిని ఉత్తినే చేత్తో చేసి చూపాడు. దుకాణాదారు అతనికేం కావాలో గ్రహించి తెచ్చి ఇచ్చాడు. ఆ తరవాత ఒక అంధుడు రంపం కొనడానికి వెళ్ళాడు. తనకు ఒక రంపం కావాలని తెలియజేయడానికి దుకాణాదారుకు అర్థమయ్యేలా చూపడానికి అతడు ఎలాంటి అభినయం చేయగలడో ఊహించ గలరా?



## చేసి చూడండి

# మొలకెత్తే ఏనుగు!



కావలసిన వస్తువులు:

సగటు సైజు బంగాళాదుంప, ప్లాస్టిసైన్, నాలుగు ఐస్‌క్రీమ్ పుల్లలు, చిన్న స్పాంజిముక్క, కొన్ని కొత్తిమిర విత్తనాలు.

చేసేవిధానం:

1. చిన్న చిన్న ప్లాస్టిసైన్ ముద్దలతో ఏనుగు తొండం, తోక, కళ్ళు, చెవులు చేసుకుని చిత్రంలో చూపిన విధంగా బంగాళాదుంప మీద అమర్చండి.
2. ఐస్‌క్రీమ్‌పుల్లలను ఏనుగుకాళ్ళలాగా దుంపకు నాలుగువైపులా గుచ్చండి
3. బంగాళాదుంప మధ్య చిన్న రంధ్రం చేయండి. అందులోకి తడిగా ఉన్న చిన్న స్పాంజి ముక్క, కొత్తిమిర విత్తనాలు వేయండి.
4. కొన్ని రోజులలో కొత్తిమిర విత్తనాలూ, బంగాళాదుంపా మొలకెత్తడం చూడవచ్చు.

# L నుంచి సింహం!



## బంగారు గడియలు. 10 సమాధానాలు



### ప్రపంచంలో ఎక్కడ

1. జపానులో. ఫ్యూజియామా పర్వతం.
2. మియాన్మార్ (బర్మా)లో.
3. లండన్‌లో (ఇంగ్లాండు).
4. మడగాస్కర్.
5. కింబర్లీ, దక్షిణ ఆఫ్రికా.

### కథా ప్రహేళిక

ఆ పెద్దమనిషి తల పెద్దది అన్నంత వరకు హెూమ్స్ చెప్పింది నిజం. ఎందుకంటే టోపీ సైజు పెద్దది. అయితే పెద్దతలలో గొప్ప తెలివితేటలు ఉంటాయని హెూమ్స్ ఊహించడం పొరబాటు. మనిషి తెలివితేటలు అతని తల పరిమాణాన్ని బట్టి ఉండవు. అక్కడి వర్ణనను బట్టి చూస్తే, ఆ టోపీదారు తలకన్న హెూమ్స్ తల చిన్నది. అంతమాత్రాన హెూమ్స్ అతనికన్న తెలివి తక్కువ వాడని అర్థం కాదు!

### చిత్ర ప్రహేళిక

రెడ్ఇండియన్లకు గుర్రాలు లేవు. అమెరికాకు గుర్రాలను స్పెయిన్ దేశస్థులు తెచ్చారు.

### పిక్చర్ క్విజ్

1. ఆర్చర్ ఫిష్. అది కీటకాలను నీటిని చిమ్మి పడగొడుతుంది. 2. మృత సముద్రం. దీనిపేరు సముద్రమే గాని, నిజానికి ఇదొక సరస్సు. 3. పోర్చుగల్.




# మహాభారతం

చావు తప్పి కన్ను లొట్టపోయినట్టుగా అయి దుర్యోధనుడు తన వారి నందరినీ కలుసుకుని, దుర్భరమైన అవమానంతో కుంగిపోతూ, హస్తినాపురికి ప్రయాణమై, దారిలో ఒక చెరువు ఉండే చోట మజిలీ చేశాడు.

యుద్ధరంగం నుంచి పారిపోయిన కర్ణుడు ఆ మజిలీలో తిరిగి దుర్యోధనుణ్ణి చేరుకుని, జరిగిన సంగతి ఎరగక, "దుర్యోధనా,నీ పరాక్రమం ఎటువంటిదనాలి! ఆ గంధర్వులను జయించి ఇంటికి తిరిగిపోతున్నావా? వాళ్ళు ఉద్దండులు. వాళ్ళకు తట్టుకోలేక నేను వికర్ణుడి రథం మీద పారిపోయి, ఇంతసేపూ ఎక్కడో దాగి ఉండి, ఇప్పుడే వస్తున్నాను. నీ వంటి శూరుడు ప్రపంచంలో మరొకడు ఉండడు," అన్నాడు ఉత్సాహంగా.

కర్ణుడు ఇలా మెచ్చుకునేసరికి దుర్యోధనుడికి దుఃఖం ఆగలేదు. అతను వణుకుతున్న గొంతుతో, జరిగినదంతా కర్ణుడికి చెప్పి, "నేను యుద్ధంలో గెలిచినా కీర్తి వచ్చేది, చచ్చినా వీరస్వర్గం వచ్చేది. రెండూ జరగలేదు. రెంటికీ చెడ్డ రేవడినైనాను. ఈ అవమానం మోసుకుని హస్తినాపురానికి తిరిగి వెళ్ళలేను. నా తండ్రికీ, ద్రోణ కృపాశ్వత్థామలకూ నా మొహం చూపలేను.వాళ్ళతో జరిగినది చెప్పలేను. నాకసలు జీవితంమీద విరక్తి పుట్టింది. చచ్చిపోతాను. నే నిక్కడే ప్రాయోపవేశం చేస్తాను. మీ రందరూ హస్తినాపురానికి వెళ్ళిపొండి. దుశ్శాసనుడికి పట్టం కట్టి, మీరందరూ ఉండి రాజ్యం ఏలించండి," అంటూ తమ్ముణ్ణి కౌగిలించుకున్నాడు. ఇద్దరూ ఏడ్చారు.

కర్ణుడు వారి ఏడుపు చూసి చిరాకు పడుతూ, "మీరిద్దరూ దేనికని శోకాలు పెడుతున్నారు? ఏడ్చిన కొద్దీ మరింత ఏడుపే గాని మనశ్శాంతి రాదు. పాండవులు నిన్ను

34. కర్ణుడి దిగ్విజయం



దేవతలకు ఓడి పాతాళంలో నివాసం ఏర్పరచుకున్న దానవులకు దుర్యోధనుడి ప్రయోపవేశ దీక్ష తెలిసింది. వారు దుర్యోధనుణ్ణి తమ వద్దకు తెప్పించుకోవటానికిగాను అగ్ని చేసి, అధర్వవేద మంత్రాలు చదువుతూ, పాలతో హోమం చేశారు. అప్పుడు ఆ అగ్ని నుంచి కృత్య అనే శక్తి ఒకతె, ఆవులిస్తూ లేచి వచ్చి, దానవులముందు నిలబడి, "నా వల్ల మీకు ఏమి కావాలి?" అని అడిగింది.

"భూలోకంలో దుర్యోధనుడు ప్రాయోపవేశంచేసి ఉన్నాడు. అతన్ని ఈ పాతాళలోకానికి తీసుకురా," అని దానవులు కృత్యతో అన్నారు. కృత్య దుర్యోధనుణ్ణి పాతాళలోకానికి తెచ్చింది.

విడిపించారని నువ్వు ఎందుకు కుమిలిపోతున్నావు? నీ పౌరులుగా వారు నీకు సేవ చెయ్యటం వారిధర్మం. ఇందులో అవమానం ఏమున్నది? చచ్చిపోతానంటావు. ఈ మాట నీ సామంతులకు తెలిస్తే నిన్ను పిరికిపంద కింద జమకట్టుతారు. పాండవులకున్నదంతా నువ్వు లాగేస్తే వాళ్ళు ప్రాయోపవేశం చేశారా? ఇలాటి వెర్రిఆలోచనలు మానుకో," అన్నాడు.

వెంటనే శకుని, "నేను నీకు జూదంలో పాండవుల సర్వస్వమూ గెలిచి పెట్టినది అనుభవించక ప్రాయోపవేశం చేస్తానంటావేమిటి?" అన్నాడు.

ఎవరి మాటలూ దుర్యోధనుడి చెవికి ఎక్కలేదు. అతను దర్భలు పరుచుకుని, నారబట్టలు కట్టి, ప్రాయోపవేశం చేశాడు.

దానవులు ఆ రాత్రి అంతా దుర్యోధనుణ్ణి తమ మధ్య ఉంచుకుని, కబుర్లు చెప్పి, "నీ సామంతులు మహాశూరులు. నువ్వు ఉత్తమ క్షత్రియుడవు. క్షత్రియధర్మం విడిచి, ప్రాయోపవేశం చేశావేమిటి? ఇందువల్ల నీకు ఆత్మహత్య చేసుకున్న పాపం తప్ప ఇంకేమీ లభించదు. సుఖమూ, కీర్తీ కూడా దక్కవు. నీ శత్రువులు మాత్రం ఆనందిస్తారు. నిజం చెబుతున్నాము, విను. ఈశ్వరుడి వరం పొంది, వజ్ర సమానమైన నీ శరీరం పై భాగాన్నీ, లోకమాత వరం పొంది, అందమైన నీ శరీరం దిగువ భాగాన్నీ మేమే సృష్టించాం. నువ్వు సాధారణ మానవుడివి కాదు, దేవతామూర్తివి. యుద్ధంలో నీ పక్షాన పోరాడి, నీ శత్రువులను వధించబోయే వారందరూ మా అంశలతో పుట్టినవారే. నీ స్నేహితుడు కర్ణుడు నరకాసురుడి అంశ

గలవాడు. అందుచేత నువ్వు విచారించకు," అని అతని మనసుకు ఊరట కలిగించి పంపేశారు. కృత్య అతన్ని తిరిగి భూలోకానికి తెచ్చి, దర్భశయ్యమీద పడుకోబెట్టి అదృశ్య మయింది.

దుర్యోధనుడు నిద్ర లేచి, రాత్రి జరిగిన దంతా కల అనుకున్నాడు. దాన్ని గురించి అతను ఎవరికీ చెప్పలేదు.

ఈసారి కర్ణుడు దుర్యోధనుడి మనసు తేలికగానేమార్చగలిగాడు. అతను తన పరి వారాన్ని వెంట బెట్టుకుని, వైభవంగా హస్తినా పురానికి తిరిగివెళ్ళాడు.

నిండు సభలో భీష్ముడు దుర్యోధనుడితో, "వద్దంటే వినక, ఘోషయాత్ర వెళ్ళి, పరాభవం పొందావు. ధర్మరాజు నీ మానం కాపాడి, నీ పట్ల ఉదారంగా ప్రవర్తించాడు. కర్ణుడి మాటలు నమ్మి నువ్వు అలాటి వాడితో వైరం పెట్టుకున్నావు. నువ్వు స్నేహితుడను కునే కర్ణుడు, నిన్ను గంధర్వుల పాలపెట్టి, తాను యుద్ధరంగం నుంచి పారిపోయాడు. ఇప్పటికైనా పాండవులతో స్నేహం చేసుకుని, వంశాన్ని కాపాడు," అన్నాడు.

దుర్యోధనుడు పకపకా నవ్వి, కర్ణ శకుని దుశ్శాసనులతో సభ నుంచి వెళ్ళిపోయాడు. భీష్ముడి మాటలు కర్ణుడికి తలవంపు కలి గించాయి. అతను దుర్యోధనుడితో, "రాజా, నాకు సేన ఇయ్యి, భీమార్జున నకుల సహ దేవులు నలుగురూ కలిసి జయించిన దేశా లన్నిటినీ నేనొక్కణ్ణే జయించి నీ కిస్తాను. అప్పుడు ఈముసలి భీష్ముడు నన్నింత తేలి కగాచూడడు,"అన్నాడు. దుర్యోధనుడు సమ్మ తించాడు.



కర్ణుడు సేనతో బయలుదేరి, మొట్ట మొదటగా ద్రుపదుణ్ణే ఓడించి, కప్పం పుచ్చుకున్నాడు. తరవాత అతను ఉత్తరంగా వెళ్ళి, అంగ, వంగ, కళింగ, మగధ, మత్స్య, కోసల మొదలైన దేశాల రాజులను ఓడించి, అందరి వద్దా కప్పాలు పుచ్చు కున్నాడు. తరవాత కర్ణుడు దక్షిణ జైత్ర యాత్ర చేసి, చాలా రాజులను ఓడించాడు. కుండిన నగర రాజైన రుక్మి లాటి వాళ్ళు కర్ణుడితో యుద్ధం చెయ్యక స్నేహం చేశారు. ఇలా దిగ్విజయంచేసి, ధనంతో కర్ణుడుకొంత కాలానికి హస్తినాపురానికి ఉత్సాహంగా తిరిగి వచ్చాడు.

దుర్యోధనుడు కర్ణుణ్ణి అభినందించి, "భీష్ముడూ, ద్రోణుడూ, బాహ్లికుడూ మొద లైన వీరులు ఎందరుండి కూడా నువ్వు



చేసిన సహాయం నాకు చేయలేకపోయారు. ఈ లోకంలో నీకు సమానులెవరూ లేరు," అన్నాడు.

కర్ణుడు దిగ్విజయంచేశాడు గనక తాను కూడా రాజసూయం చేయాలని బుద్ధిపుట్టింది దుర్యోధనుడికి. అందుకు తగిన ఏర్పాట్లన్నీ చేసి, ఋత్విజులను పిలిచి, తన చేత రాజసూయం చేయించమని అతను వారిని కోరాడు.

కాని ఋత్విజులు అందుకు అభ్యంతరాలు చెబుతూ, "పాండవులను జయించి గాని రాజసూయం చేయటానికి వీలులేదు. అదీగాక, నీ తండ్రి బతికి ఉన్నాడు. ఆయన బతికి ఉండగా నీకు చక్రవర్తి అయ్యేఅర్హత లేదు. రాజసూయంతో సమానమైనది వైష్ణవమనే మరొక యజ్ఞం ఉన్నది. కావాలంటే ఆ యజ్ఞం చెయ్యవచ్చు," అని సలహా ఇచ్చారు.

దుర్యోధనుడు ఈ మాట తన తమ్ములకూ, కర్ణ శకునులకూ చెబితే, వాళ్ళు ఋత్విజులు చెప్పినట్టే చెయ్యమని చెప్పారు. యజ్ఞానికి కావలిసిన ఏర్పాట్లన్నీ జరిగాయి. నగరం వెలపల యజ్ఞశాల నిర్మించారు. ద్వైతవనంలో ఉన్న పాండవులను యజ్ఞానికి ఆహ్వానించటానికి దుర్యోధనుడు దూతను పంపాడు.

ధర్మరాజు ఆ దూతతో, "దుర్యోధనుడు యజ్ఞం చెయ్యటం గొప్ప విషయం. మాకు కూడా వచ్చి యజ్ఞం చూడాలనే ఉన్నదిగాని, మేమిప్పుడు హస్తినాపురానికి వస్తే మా వనవాసదీక్ష భంగమవుతుంది గనక, మేము రాలేము," అన్నాడు.

ఆ దూతతో భీముడు, "మా అరణ్యవాసమూ, అజ్ఞాతవాసమూ పూర్తి అయ్యాక మా ధర్మరాజు దుర్యోధనుణ్ణీ, అతని తమ్ములనూ బలి పశువులుగా పెట్టి, శస్త్రాలతోగొప్ప యజ్ఞం చెయ్యబోతాడు. ఆ యజ్ఞానికి నేను తప్పక వస్తానని దుర్యోధనుడితో చెప్పు," అన్నాడు.

దుర్యోధనుడి వైష్ణవయజ్ఞం విజయవంతంగా జరిగి, పూర్తి అయింది. కర్ణుడు దుర్యోధనుణ్ణి అభినందిస్తూ, "వచ్చేయుద్ధంలో నేనుపాండవులనుచంపి,నీచేతరాజసూయం చేయిస్తాను, చూస్తూఉండు!" అన్నాడు.

అక్కడ పాండవులు ద్వైతవనంలో చాలా కాలం ఉండటంచేత, వారు వేటాడిన కారణంగా మృగాల సంఖ్య బాగా క్షీణించి పోయింది. అందుచేత ధర్మరాజు తన

తమ్ముళ్ళతో సహా తిరిగి కామ్యకవనం చేరాడు. అక్కడ వారు పళ్లూ, కాయలూ, దుంపలూ ఏరిచాలావరకువాటితోనే పొట్టపోసుకుంటూ కాలక్షేపం చేశారు.

వాళ్ళ వనవాసం పదకొండేళ్ళు ముగిసింది. ధర్మరాజుకు చాలా బాధగా ఉండేది. తాను జూదం ఆడకుండా ఉంటే తనకూ, తన తమ్ములకూ, ద్రౌపదికీ ఈ దుర్భరమైనకష్టాలు రాకపోను! ముందు రాబోయేది తలుచుకున్నా బాధగానే ఉండేది. కర్ణుడు పాండవుల నందరినీ యుద్ధంలో చంపుతానని దుర్యోధనుడికి మాట ఇచ్చాడు. ఇలాటి మనోవేదనలతో ధర్మరాజుకు రాత్రివేళ నిద్రకూడా పట్టేదికాదు.



పాండవులు కామ్యకవనంలో ఉండగా ఒకసారి వ్యాసుడు వారిని చూడ వచ్చి,వారు కృశించి ఉండటం చూసి బాధపడ్డాడు. వారికి ఉపశమనం కలిగే మంచి మాటలు చెప్పి, పదమూడేళ్ళ నియమమూ విజయవంతంగా పూర్తికాగానే పాండవులకు తిరిగి రాజ్యప్రాప్తి కలుగుతుందని ధైర్యం చెప్పి, వెళ్ళిపోయాడు.

పాండవులు ఈవిధంగా అరణ్యంలో అలమటిస్తూ ఉండగా, దుర్యోధనుడూ, కర్ణుడూ, శకునీ వారిని ఎలా బాధలకు గురి చేయాలా అని ఏవేవో ఆలోచనలు చేస్తూ వచ్చారు.

ఆ సమయంలో దుర్వాసమహాముని, తన పదివేల మంది శిష్యులతో హస్తినాపురానికి వచ్చాడు. దుర్వాసుడు మహాకోపిష్ఠి. ఆయనకు జరిగే ఆతిథ్యంలో ఏమాత్రం లోపం వచ్చినా శపించేస్తాడు. అందుకని దుర్యోధనుడూ, అతని తమ్ములూ ఎంతో జాగ్రత్తగా ఆ మునికి అత్యంత భక్తి శ్రద్ధలతో సేవలుచేసి, వినయ విధేయతలతో నడుచుకున్నారు.

దుర్యోధనుడికి దుర్వాసుడు అనేక రకాల పరీక్షలు పెట్టాడు.

"రాజా, నాకు ఆకలిగా ఉన్నది. వేగం భోజనం సిద్ధం చేయించు. స్నానం చేసి వస్తాను," అని దుర్వాసుడు వెళ్ళిపోయి, ఎంతకూ వచ్చేవాడు కాదు. ఆలస్యంగావచ్చి, "ఆకలి లేదు," అనేవాడు.

ఒకసారి అర్ధరాత్రివేళ లేచి, "మా కందరికీ ఆకలిగా ఉన్నది," అనేవాడు దుర్వాసుడు. తీరా అన్నంవడ్డిస్తే ఆకలి లేదనేవాడు. ఒక్కోసారి, "ఛీ, ఇదేం భోజనం!" అనితిట్టి, తినటం మానేసేవాడు.

ఇలా ఎన్ని తిప్పలు పెట్టినా దుర్యోధనుడు ఓర్పుగా అన్నిటినీ సహించి సేవలుచెయ్యటం చూసి దుర్వాసుడు సంతోషించి, "రాజా, నీ పరిచర్యలకు సంతోషించాను. నీకు ఏమి కావాలో కోరు," అన్నాడు.

దుర్వాసుడు శపించనందుకు దుర్యోధనుడు ఎంతగానో సంతోషించి, శకుని కర్ణ దుశ్శాసనులతో సంప్రతించి, దుర్వాసుడితో, "స్వామీ, పరమ ధర్మాత్ముడైన ధర్మరాజు అరణ్యంలో ఉన్నాడు. ఆయన వెంట ఆయన తమ్ములూ, భార్యా, అనేకమంది బ్రాహ్మణులూ ఉన్నారు. ద్రౌపది వారికందరకూ భోజనాలు పెట్టి, తాను తిని, పడుకుని ఉన్న సమయంలో మీరు మీ శిష్యగణంతో సహా అక్కడికి వెళ్ళి ఆతిథ్యం అడగాలి. ఇదే నేను మీ నుంచి కోరే వరం," అన్నాడు.

దుర్వాసుడు అందుకు సమ్మతించి,తన శిష్యులతో సహా కామ్యకవనానికి బయలు దేరాడు. దుర్యోధనుడి సంతోషానికి మేర లేదు,"పాండవులు దుర్వాసుడికి ఆగ్రహం తెప్పించి, ఆయన శాపానికి గురిఅయి, నాశనమైపోతారు. ఇంతకాలానికి మనకోరిక తీరుతున్నది," అని కర్ణుడు దుర్యోధనుడితో అన్నాడు. శకుని దుశ్శాసనులు సంతోషించారు.

కామ్యకవనంలో ఒకనాడు ద్రౌపది తన భర్తలకూ, బ్రాహ్మణులకూ భోజనం పెట్టి, తానుకూడా తిని, పడుకున్నది.

ఆ సమయంలో వారి ఆశ్రమానికి దుర్వాసుడు తన పదివేల శిష్యులతోనూ వచ్చి చేరాడు.

ధర్మరాజు తన తమ్ములతో సహా దుర్వాసుడికి ఎదురు వెళ్ళి, స్వాగతం చెప్పి, అర్ఘ్య పాద్యాలతో పూజించి,"మహాత్మా, తమరుతను శిష్యులతోసహా మా ఆతిథ్యం స్వీకరించాలి" అన్నాడు.

ఈ మహారణ్యంలో ఉంటున్న వాడు తనకూ, తన శిష్యులు పదివేలమందికీఎలా భోజనం పెడతాడా అన్న ఆలోచన కూడా లేకుండా, దుర్వాసుడు ధర్మరాజు ఆతిథ్యం స్వీకరించటానికి ఒప్పుకుని, తన శిష్యులతో సహా స్నానంచేసి రావటానికి గంగానదికి వెళ్ళాడు.

ఇంతమందికి ఎలా భోజనం పెట్టాలో ద్రౌపదికి అర్థం కాలేదు. ఆమెకు ఇంకేదారీ కనిపించక కృష్ణుణ్ణి ధ్యానించింది.



# చందమామ కబుర్లు

## అతిపెద్ద క్రిస్మస్ కార్డు!

కేరళకు చెందిన లేఖ ఎస్. బాబు అనే ఒక డ్రాయింగ్ టీచర్, తమ పాఠశాల యాజమాన్యానికి క్రిస్మస్ శుభాకాంక్షలు అందజేస్తూ ఒకకార్డు పంపింది. ఆ కార్డు ప్రధానోద్దేశం గత సంవత్సరం ఉద్యోగం నుంచి తొలగించ బడిన 11మంది పాఠశాల సిబ్బందిని, క్రిస్మస్ సందేశమైన క్షమాగుణంతో, ప్రేమభావంతో మళ్ళీ ఉద్యోగంలో చేర్చుకోమని అర్థించడమే. ఆ కార్డుకు సంబంధించిన మరొక విశేషం ఏమంటే దాని పొడవు 1,332 అంగుళాలు (111అడుగులు); వెడల్పు 11అంగుళాలు; బరువు 870 గ్రాములు. ఆ కార్డును తయారుచేయడానికి లేఖ ఎస్.బాబుకు 10 రోజుల పాటు 50 గంటలసేపు పట్టింది!



## పొడవైన కేక్

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ స్థాపించబడి పాతికేళ్ళు నిండిన సందర్భంగా రజతోత్సవాలు జరుపుకుంటూ ఒక కేక్‌ను తయారుచేశారు. దీని పొడవు 2.5 కి.మీ.; బరువు 74 టన్నులు. 2,00,000 మందికి సరిపోతుందనుకున్న ఈ కేక్ 50,000 మందికే చాల లేదు. దానిని దుబాయ్ సముద్రతీరంలో లాంఛనప్రాయంగా కట్ చేయగానే అక్కడ గుమిగూడిన ప్రజలు అమితోత్సాహంతో ముందుకు ఉరికి తలా కొంచెం లాగేసుకుని క్షణాలలో కేక్ ఉన్న చోటు తెలియకుండా చేసేశారు. కేక్ మధ్య బంగారు నాణాలూ, ఆరు మెర్సిడీస్ - బెంజ్ కార్ల తాళాలూ ఉన్నాయన్న వదంతి ప్రబలడం దీనికొక ముఖ్య కారణం. నిజానికి ఇది ఒకే కేక్ కాదు. 5,175 కేకులను ఒక దాని పక్కన ఒకటి అమర్చి బ్రహ్మాండమైన ఈ కేక్‌ను తయారుచేశారు. వీటికి 3,0800 కి.గ్రా. పళ్ళు, 5,700 కి.గ్రా. ఖర్జూరం, 8,600 కి.గ్రా.. పిండి, 67,300 గుడ్లు, టన్నులకొద్దీ నెయ్యి, చక్కెర మొదలైన పదార్థాలను ఉపయోగించారు. దీనిని తయారు చేయడానికి 28 హోటళ్ళు 25 రోజులు రాత్రింబవళ్ళు పనిచేశాయి!

## రికార్డు అమ్మకం!

గత సంవత్సరం అమెరికా – సుప్రసిద్ధ సినీతార మార్లిన్ మన్రో చిత్రంతో పోస్టేజ్ స్టాంపును విడుదల చేసింది. ఒక సంవత్సరంలో– 46,000,000 స్టాంపులు అమ్ముడయ్యాయి. 1993వ సం॥లో సుప్రసిద్ధ పాప్ సింగర్ ఎల్విస్ ప్రీస్‌లీ గౌరవార్థం పోస్టేజ్ స్టాంపును విడుదల చేసింది. ఇవి మూడేళ్ళలో– 124,000,000 స్టాంపులు అమ్ముడయ్యాయి. స్టాంపుల అమ్మకంలో ఇవి సరికొత్త రికార్డును సృష్టించాయి!

చందమామ అనుబంధం 101



మనదేశపు అందచందాలు

# గంభీరమైన పురానాఖిలా

మనరాజధాని ఢిల్లీనగరం నడిబొడ్డున – మహాభారతంలోని పాండవుల నివాస నగరం ఇంద్రప్రస్థం ఉండేదని భావించబడే స్థలంలో పురానాఖిలా కోట ఉన్నది. 1533వ సం॥ప్రాంతంలో రెండవ మొగల్ చక్రవర్తి హుమయూన్ కాలంలో దీనిని దీన్ పన్నా అని పిలిచేవారు. ఆయన తరవాత రాజైన షేర్‌షా సూరి – ఎత్తయిన గోడలతో చుట్టబడిన భవనాన్ని కోటగా చేసుకుని దాని చుట్టూ భవనాలతో ఆరవ ఢిల్లీ నగరాన్ని నిర్మించాడు. 1540 – 45 మధ్యకాలంలో షేర్‌షా కోటను మరింత పటిష్ఠం చేసి దానికి 'షేర్ ఘర్' అని పేరుపెట్టాడు. ఆయన 1541వ సంవత్సరంలో ఖిలా-ఇ-కున్హా మసీదును నిర్మించాడు. దీర్ఘచతురస్రాకారంలో ఉన్న ఈకోట లోపలికి, తలీఖీ దర్వాజా గుండా వెళ్ళాలి. ఎత్తయిన కోట గోడలకు ఎదురుగుండా, రకరకాల వింత మృగాలు గల అందమైన ఢిల్లీ జంతు ప్రదర్శనశాల ఉన్నది. ఖిలా లోపల పురాతత్వశాఖ జరిపిన త్రవ్వకాలలో రాతిశిల్పాలు, వంట పాత్రలుబయట పడ్డాయి. వీటివల్ల దాదాపు 2,000 సంవత్సరాలకు పైబడిన సాంస్కృతిక చరిత్ర ఈ స్థలానికి కలదని రుజువవుతున్నది!



మనదేశపు ఋషులు:

# జైగీషవ్యుడు

అందమైన అరణ్య ప్రాంతంలోని ఒకకొండ పాదతలంలో దేవలుడనే ముని, ఆశ్రమం నిర్మించుకుని శిష్యులతో నివసించ సాగాడు. ఒకనాడు ఆయన ఆశ్రమానికి జైగీషవ్యుడనే ముని అతిథిగా వచ్చాడు.

దేవలుడూ, ఆయన శిష్యులూ భక్తి శ్రద్ధలతో ముని అవసరాలు సమకూర్చడానికి పూను కున్నారు. కాని ఆయనకు పెద్ద అవసరాలు ఏవీ కలిగేవికావు. ఎప్పుడు చూసినా ఆయన ప్రశాంతంగా, మందస్మిత వదనంతో కనిపించే వాడు.

ఒకనాడు జైగీషవ్యుడు ధ్యానంలో ఉండగా, దేవలుడు సముద్రస్నానానికి వెళ్ళాడు. దేవలుడు సముద్రాన్ని సమీపిస్తూండగా జైగీషవ్యుడు స్నానం ముగించి సముద్ర జలం నుంచి వెలుపలికి రావడం చూశాడు. ఆయనకు సముద్రానికి దగ్గరిదారి తెలుసుకాబోలు అనుకుంటూ దేవ లుడు స్నానం ముగించి ఆశ్రమానికి వచ్చి చూస్తే, అక్కడ జైగీషవ్యుడు, మూసిన కళ్ళు తెరవకుండా, తాను అంతకు ముందు చూసిన విధంగానే ధ్యాననిమగ్నుడై ఉన్నాడు! మరునాడు దేవలుడు వేరొక ముని ఆశ్రమానికి వెళితే జైగీషవ్యుడు అక్కడా కనిపించాడు. ఇంకొకసారి అలాగే నదీతీరంలో కనిపించాడు. ఆ తరవాత దేవలుడు ఎక్కడికి వెళ్ళి తన అతిథిని తలుచు కున్నా అతడు అక్కడ కనిపించే వింత అను భూతికి లోనయ్యాడు.

ఇక ఉండబట్టలేక ఒకనాడాయన జైగీష వ్యుణ్ణి ఈ రహస్యం గురించి అడిగాడు. అయితే, ఆయన ఆ సంగతి గురించి తనకేమీ తెలియ దన్నాడు!

ఆ తరవాత దేవలుడు ఎందరో మహనీయు లను సందర్శించి తన సందేహం గురించి అడి గాడు. ఆఖరికి ఒక మహాముని ఆయనకు ఇలా వివరించాడు: "చరాచర ప్రపంచమంతటా వ్యాపించినది బ్రహ్మం. ప్రతిచోటా, ప్రతివస్తువూ బ్రహ్మంలోనే ఐక్యమై ఉన్నది. బ్రహ్మానికి వెలు పల అంటూ ఏదీ లేదు. జైగీషవ్యుడు సర్వేం ద్రియాలనూ జయించి, ఏకాగ్ర చిత్తంతో నిరంతర ధ్యానంతో పరబ్రహ్మ స్వరూప జ్ఞానంలో లీనమై పోయాడు. జగత్తులో బ్రహ్మంలేని చోటంటూ లేదు. నువ్వు తలుచుకున్న ప్రతిచోటా జైగీషవ్యుడు కనిపించడానికి అదే కారణం!"



## మీకు తెలుసా?

# విలక్షణమైన నూతన సంవత్సరం!



స్విట్జర్లాండులోని ఒక చిన్న గ్రామం యూమాష్. ఇక్కడ యేటా జనవరి 13వ తేదీ నూతన సంవత్సర వేడుకలు జరుపుకుంటారు. ఆ రోజున మనుషులు చెట్ల వేషాలు వేసుకుని, ఆడుతూ పాడుతూ ఇంటింటికీ వెళ్ళి నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తారు. నాచు, ఎండుటాకులు, నత్తగుల్లలతో తయారుచేసిన తొడుగులు కొందరుధరిస్తే, మరి కొందరు గడ్డీ గాదం, చెట్టు బెరడు మొదలైన వాటితో తయారు చేసిన దుస్తులు ధరిస్తారు.

## ఇంద్రధనుస్సు



### సువాసనలు వెదజల్లే అగరువత్తులు

ఒక వత్తి వెలిగిస్తే చాలు, గదినంతా సువాసనలతో గుబాళింపజేసే గుణం కలవి అగరువత్తులు. వీటిని పటాల ముందు, విగ్రహాల ముందు వెలిగిస్తారు. ముఖ్యంగా పూజకు ఉపయోగిస్తారు. మన దేశంలో దాదాపు 4, 98,000 కుటుంబాల వారు, యేటా 710 కోట్ల రూపాయలు వెచ్చించి అగరు వత్తులు కొంటున్నారు! మొదట – గంధం, గులాబీపూలు, మల్లెపూలు వంటి వాటిని ఉపయోగించి అగరువత్తులు తయారుచేసే వారు. ఇప్పుడు ఈ వత్తులను 'మచిలాస్ మకరంద' చెట్లనుంచి తయారుచేస్తున్నారు. ఈనాడు యూరపు సుగంధ ద్రవ్యాలకు మంచి గిరాకీ ఉన్నది. ఈ రకం ఆధునిక సుగంధ ద్రవ్యాలకు ఫ్రాన్స్ ప్రథమస్థానం వహిస్తున్నది.



# ఆరోగ్య రహస్యం

గుర్నాధానికి జలుబు చేసింది. గొంతు భారంగా వుండి మాట అదొకలాగా వస్తున్నది. మాటి మాటికీ ముక్కూ, కళ్ళూ తుడుచుకో వలసివస్తున్నది. తల కూడా నొప్పిగా వుండి, తరచుగా కణతలు నొక్కుకుంటున్నాడు. అన్నం సహిస్తున్నది కానీ జ్వరం వచ్చినట్టుంది.

ఈ అవస్థలన్నీ పడలేక ఆయన తన కొడుకును వైద్యుడింటికి పంపాడు. వైద్యుడు వాడికి కొన్ని గుళికలిచ్చి పంపాడు. అవివేసు కుంటే ఆయనకు కాస్త జ్వరం తగ్గినట్టుంది కానీ మిగతా లక్షణాలేమీ తగ్గలేదు.

"వైద్యుడికేమని చెప్పావురా? జ్వర మొక్కటే తగ్గింది!" అన్నాడు గుర్నాధం, కొడుకును నిలదీస్తూ.

"జలుబని చెప్పాను నాన్నా," అని బదు లిచ్చాడు కొడుకు. "జలుబంటే జ్వరమను కున్నాడో ఏమిటో? మళ్ళీ వెళ్ళి నా బాధలన్నీ చెప్పిరా!" అన్నాడు గుర్నాధం. కొడుకు మళ్ళీ వెళ్ళాడు కానీ వైద్యుడు చిరాకుపడి, "జలు బుంటే అవన్నీ వుంటాయి. అంత వివరంగా చెప్పక్కర్లేదు," అన్నాడు కానీ కొత్తమందేమీ ఇవ్వలేదు.

వైద్యుడికి పనెక్కువైతే చిరాకు పెరుగు తుంది. అందులోనూ చిన్నవాళ్ళు వెళ్ళితే, ఆయన లక్ష్యపెట్టడు. తనకు సరైన మందు కావాలనుకుంటే స్వయంగా వెళ్ళి వైద్యుణ్ణి కలుసుకోవడం మంచిది!

ఇలా ఆలోచించి సాయంత్రం చల్లబడే దాకా ఆగి, గుర్నాధం వైద్యుడింటికి బయల్దే రాడు. దారిలో ఆయన పదిసార్లు తుమ్మాడు. పాతికసార్లు దగ్గాడు. విశ్రాంతికని ఒకటి, రెండిళ్ళ అరుగుల మీద చతికిలబడ్డాడు.

ఎందరో ఆయన్ను పలకరించి పడుతున్న అవస్థలన్నీ తెలుసుకుని, ఎంతగానో జాలి పడ్డారు. వైద్యుడిల్లు చేరాక ఆయన, "అయ్యో! మీరు స్వయంగా వచ్చారా?" అంటూ మర్యాద

జొన్నలగడ్డ రామలక్ష్మి

చేసి,లక్షణాలన్నీ తానేస్వయంగా అడిగి తెలుసుకుని, "అబ్బాయి ఒక్కటీ తిన్నగా చెప్ప లేదు సుమా!" అని సంజాయిషీ ఇచ్చి, నాడి పరీక్షించి కొత్త మందంటూ ఏవో గుళికలిచ్చి, "వారంరోజుల పాటు సుష్టుగా భోంచేస్తూ విశ్రాంతి తీసుకోండి. జలుబు తగ్గాలంటే మందుతోపాటీ రెండూ కూడా అవసరం," అన్నాడు.

కొత్త మందుక్కూడా గుర్నాధం బాధలేమీ తొలగలేదు. విసుక్కుంటూ, ఇంటిల్లపాదినీ వేధిస్తూ రోజులు గడుపుతూంటే వారంరోజులకు ఆయన మళ్ళీ మామూలు మనిషయ్యాడు.

జలుబిలా తగ్గిందోలేదో గుర్నాధం పెరట్లో కాలుజారి పడ్డాడు. మోకాలు దగ్గర బెణికింది. ఇంట్లో వాళ్ళు కాపడాలు పెట్టారు. వైద్యుడు లేపనంపూశాడు. ఊరిగణాచారి వచ్చి బెణుకు మంత్రం వేశాడు. గుర్నాధం మూడు రోజులు మంచం దిగలేదు. విషయంతెలిసి ఊరంతా ఆయన్ను చూడవచ్చారు. అయ్యోపాపం, అని జాలిపడ్డారు.

ఇది జరిగిన పక్షం రోజులకు గుర్నాధానికి చెవిపోటు వచ్చింది. మూడురోజులు అవస్థ పడ్డాడు. కడుపులో పోట్లొచ్చాయి. రెండు రోజులు బాధపడ్డాడు. ఛాతీలో నొప్పివచ్చింది. గుండెపోటనుకున్నారుకానీ వైద్యుడు పరీక్ష చేసి, అదేం కాదనీ, కడుపులో వాయుపీడనం వల్ల అలాజరిగిందనీ చెప్పి అందరి మనసులకూ ఊరట కలిగించాడు.

ఇలా ఏడాదిలో చాలాసార్లు జబ్బుపడ్డాడు గుర్నాధం. ఊరందరూ ఆయనపై సానుభూతి చూపించారు. చివరకీ వార్త ఊరుదాటి పొరుగూళ్ళకుక్కూడాపాకి, ఆయన బావమరిది బసవయ్య చూడ్డానికివచ్చాడు. గుర్నాధం బసవయ్యకు తనబాధలుచెప్పుకుని, "పెద్దవాడినై పోతున్నానో ఏమిటో, నా ఆరోగ్యం నానాటికీ తీసికట్టవుతున్నది," అని వాపోయాడు.



"అదేంటి బావా, అలాగంటావు? నువ్వేమంత పెద్దవాడివి? నీకింకా యాభై నిండలేదు. అరవైనిండిన వాళ్ళే ఎందరో నిక్షేపంలా వుంటున్నారు. అనవసరంగా దిగులుపడకు," అని బసవయ్య, గుర్నాధాన్ని ఓదార్చాడు.

"దిగులుపడకు అని నువ్వనగానే సరిపోతుందా? ఈ బాధలన్నీ పడలేకపోతున్నాను. ఏం చేయాలో తోచకుండా వుంది. నువ్వు చెప్పిన ప్రకారం అనుభవించడం తప్ప వేరే దారి ఉన్నట్టులేదు కాబోలు!" అన్నాడు గుర్నాధం నీళ్ళుగారిపోతూ.



వలసింది చేసి ఆపైన దేవుడిదే భారమను కుంటాను. నా చుట్టూవున్న వాళ్ళననుమాని స్తూకూర్చోక, అందర్నీనమ్ముతాను. ఎవరైనా మంచిచేస్తే సంతోషిస్తాను. చెడుచేస్తే దూరంగా వుంటాను తప్ప, వాళ్ళ మీద పగ పెంచుకోను. ఇవన్నీ ఆరోగ్యసూత్రాలనే అనుకుంటున్నాను. ఎందుకంటే నా కింతవరకూ పెద్దజబ్బులేం చేయలేదు," అన్నాడు బసవయ్య.

"నువ్వు చేసేవన్నీ నేనూ పాటిస్తున్నాను. అయినా నా కిన్ని జబ్బులెందుకు చేస్తు న్నాయో!" అన్నాడు గుర్నాథం మరింత దిగులుగా.

బసవయ్య ఒకక్షణం ఆగి, "నేను చేసే వన్నీ పాటించడం చాలా కష్టమని అందరూ అంటారు. అంతకంటే జబ్బులతో బాధపడ డమే మంచిదని ఎందరో అన్నారు. నువ్వు మనసు సరిపెట్టుకునేందుకు ప్రయత్నిస్తు న్నావు. నేను చేసేవాటిలో నువ్వేం చేయడం లేదో బాగా ఆలోచించి తెలుసుకో. నీకుమేలు జరుగుతుంది," అన్నాడు.

గుర్నాథం ఎంత ఆలోచించినా, తను అన్నీ బసవయ్యకులాగే చేస్తున్నాననిపిం చింది. అందుకని, "నాకు తెలియడంలేదు. నువ్వే చెప్పు," అన్నాడు.

"నాకంటే పెద్దవాడివి. ఆపైన బావగారివి. నీలో తప్పులెన్నడానికి ప్రయత్నించడం నాకు మర్యాదకాదు. ఇంకెవరినైనా అడిగి తెలు సుకో!" అన్నాడు బసవయ్య.

గుర్నాథం భార్యనడిగాడు. భర్తలో లోపా లెన్నిచెప్పడానికి ఆమె ఇష్టపడలేదు. కొడుకు నడిగాడు. చెప్పడానికి వాడు భయపడ్డాడు. పాలేరునడిగితే, "బాబూ! తమ అడుగుజాడల్లో

"అయ్యో! అలాగని ఉపేక్షించడానికీలేదు, బావా. ఒకాయనరాచపుండుతో నలభైఏళ్ళకే పోయాడు. ఇంకొకావిడ క్షయతో ముప్పై ఏళ్ళకే పోయింది. అనారోగ్యాలు మందులతో మాత్రమే నయం కావు. నిత్యజీవితంలో కొన్ని ఆరోగ్యసూత్రాలు పాటించాలి," అన్నాడు బసవయ్య.

"నీకు తెలిసిన ఆరోగ్యసూత్రాలేమిటో చెప్పు," అని అడిగాడు గుర్నాథం.

"నేను బయటతిళ్ళు తినను. ఇంట్లోకూడా కడుపు పగిలేలాకాక, చాలినంత మాత్రమే భోంచేస్తాను. ఏ పండుక్కయినా అతిగా తిన వలసివస్తే, మర్నాడు ఉపవాసముంటాను. రోజూ చాలాదూరం నడుస్తాను. నా పనులు నేనే చేసుకుంటాను. ప్రతి పనీ నిదానంగా చేస్తాను. దేనికీ దిగులు పెట్టుకోను. చేయ

నడవడం వల్లనే, నేనిలా ఆరోగ్యంగా వుంటున్నాను. మీ ఆరోగ్యం బాగుండకపోవడానికి అలవాట్లు మాత్రం కారణంకాదు," అంటూ ముందరికాళ్ళకు బంధం వేశాడు.

ఇదంతా చూసిన బసవయ్య, "అబ్బే, ఇలా లాభంలేదు, బావా! నీకంటే వయసులో పెద్దయివుండి, ఆరోగ్యం చక్కగా వుండి, నువ్వంటే ఏమాత్రం భయంలేని వాళ్ళ నడిగితే, అసలు విషయం తెలుస్తుంది. అయినా వయసును బట్టి ఆరోగ్యసూత్రాలు కూడా మారుతుంటాయి కదా! నేను పాటించేవి నీకు నప్పి వుండకపోవచ్చు. పెద్దవాళ్ళ నడగడమే మంచిది," అని సలహాలిచ్చాడు.

అలాంటి మనిషి గురించి ఎవరికి తెలుస్తుందీ ఆ ఊరి వైద్యుడికి తప్ప! గుర్నాధం వైద్యుడివద్దకు వెళ్ళి, "ఊళ్ళో అందరికంటే ఆరోగ్యవంతుడెవరో చెప్పగలవా?" అని అడిగాడు.

వైద్యుడేమాత్రమూ తడుముకోకుండా, "ఈ ఊళ్ళో శేషాచలాన్ని మించిన ఆరోగ్యవంతుడుంటాడనుకోను. ఆయన ఒక్కసారి కూడా నా వద్దకు వైద్యానికిరాలేదు," అన్నాడు.

శేషాచలంవయసుఅరవైకిపైనే వుంటుంది. అయినా మనిషి పిడిరాయిలా వుంటాడు. ఎక్కడికైనా నడిచే వెళతాడు. ఎన్నడూ జిర్రున చీది ఎరగడని అంతా చెప్పుకుంటారు. వైద్యుడు చెప్పేదాకా తన కాయన పేరు తట్టనందుకు నొచ్చుకుని, వెంటనే ఆయన ఇంటికి వెళ్ళాడు గుర్నాధం.

ఆ సమయంలో శేషాచలం వీధి అరుగు మీద కూర్చునివున్నాడు. ఆయన చుట్టూ కొందరు పెద్దమనుషులు కూర్చుని వున్నారు.



"మా ఇంట్లో సంగీతసభ ఏర్పాటు చేస్తే నువ్వురాలేదు. మీ వదిన ఎంత నొచ్చుకుందో తెలుసా?" అన్నాడొక పెద్దమనిషి.

"తప్పకుండా వచ్చేవాణ్ణేరా, కానీ ఆ పూట బాగా దగ్గువస్తున్నది. సంగీత సభలో దగ్గుతూంటే రసభంగం కదా అని రాలేదంతే. తేనెరాసిన తులసాకులు నాలుగుతింటే రెండు రోజుల్లో దగ్గుతగ్గిపోయిందనుకో!" అని ఆ పెద్దమనిషిని సమాధాన పరిచి పంపేశాడు శేషాచలం.

పొరుగూళ్ళోజరిగిన తన తమ్ముడి పెళ్ళికి రాలేదని, ఇంకొక పెద్దమనిషి అన్నాడు. అప్పుడు తనకు జలుబుచేసిందనీ, పెళ్ళికొచ్చి తుమ్ము తూకూర్చోడం తనకు నచ్చదనీ చెప్పి మిరియాలకషాయంతో తన జలుబు నయమైపోయిందనికూడా చెప్పాడు శేషాచలం.

ఈ విధంగా అక్కడున్న ప్రతివారికీ ఏదో ఒక సంజాయిషీ ఇచ్చుకుంటూన్న శేషాచలా నిక్కడా, గుర్నాధానికి వచ్చిన జబ్బులన్నీ వచ్చినట్టేవుంది! ఎటొచ్చీ అన్నీ ఆయనగృహ వైద్యాలతో నయంచేసుకున్నాడు.

అందరూ వెళ్ళిపోయాక శేషాచలం నవ్వుతూ గుర్నాధాన్ని చూసి, "ఏరా! నేనునీకేం సంజాయిషీ ఇచ్చుకోవాలి?" అని అడిగాడు.

"నాకు సంజాయిషీలేం వద్దు. నీ విషయం తెలుసుకోవాలని వచ్చాను. నిజంగా నీకు అన్నిజబ్బులు చేశాయా? లేక నువ్వు వచ్చిన వాళ్ళను వదుల్చుకునేందుకేదైనా సంజాయిషీ ఇచ్చుకుంటున్నావా?" అని అడిగాడు గుర్నాధం.

"అవసరమైనప్పుడు సంజాయిషీ ఇచ్చుకోవడం తప్పుకాదులే కానీ, నువ్వు నాకు జబ్బులంటావేమిటీ? నా కెప్పుడూ ఏ జబ్బూ చేయలేదే!" అన్నాడు శేషాచలం.

"దగ్గన్నావు, జలుబన్నావు, చెవిపోటన్నావు, కాలిబెణుకన్నావు, అంతా నా చెవులతో నేను స్వయంగా విన్నాను. నీకెప్పుడూ జబ్బు చేయలేదంటా వేమిటీ?" అని అడిగాడు గుర్నాధం ఆశ్చర్యంగా.

"శరీరమన్నాక ఏవో చిన్న చిన్న చికాకులు వస్తూంటాయి. వాటన్నింటినీ జబ్బులంటా వేమిట్రా? జబ్బంటే క్షయ, సన్నిపాతం, మశూచి, రాచపుండు — ఇవీ!" అన్నాడు శేషాచలం.

గుర్నాధం ఆయనకు నమస్కరించి, "నా సందేహం తీరింది. చిన్న చిన్న అనారోగ్యాలగురించి చెప్పుకోకపోవడమే, మీ ఆరోగ్య రహస్యం. వాటిని కొండంతలుగా చేసి నేను దిగులు పడుతున్నాను! నా పొరబాటు నాకు తెలిసింది," అన్నాడు.

"మంచిది. నాక్కాస్త తలనొప్పిగా వుంది. ఒక చిన్న కునుకుతీస్తే సర్దుకుంటుంది. మరి నేను లోపలకు వెళ్ళేదా?" అన్నాడు శేషాచలం.

గుర్నాధం ఆయన వద్ద సెలవు తీసుకుని ఉత్సాహంగా ఇల్లు చేరాడు. ఆ తర్వాత కూడా చాలాసార్లు దగ్గు, పంటినొప్పి, జలుబు వంటి చికాకులాయనకు కలిగాయి కానీ, ఆ విషయం పదిమందికీ తెలిసేటంత హడావుడి చేయలేదు. దాంతో, "ఇటీవల గుర్నాధం ఆరోగ్యం బాగుపడినట్టుంది!" అని అంతా అనుకోసాగారు.





# అర్ధణాబాకీ

ఒక ఊళ్లో రామయ్య అనే బీదవాడుండేవాడు. ఎలాగైనాడబ్బు సంపాదించి తానుకూడాఒక వ్యవసాయదార్రై, మిగిలిన రైతుల్లాగే సంతకు సామాన్లు తోలుకుపోవాలని రామయ్య ఉబలాటం. కాని అతను ఎంతఒళ్లు విరుచుకున్నా తన భుక్తికే సరిపోకుండా ఉంటూ వచ్చింది.

చివరకు రామయ్య ఏదోవిధంగా సంతకు సరుకు తీసుకుపోయి అమ్మాలని నిశ్చయించుకున్నాడు. అతనివద్ద మూటెడు ఉన్ని మాత్రం ఉన్నది. ఆ కొద్దిపాటి ఉన్నినిఊళ్లో ఎవరికి అమ్మినా అమ్మవచ్చు. దానికి ఎంతో డబ్బురాదు. అలాటప్పుడు దాన్ని సంతకు తీసుకుపోతే అందరూ నవ్వుతారు.

అందుకని రామయ్య ఒకరోజు అడివికి పోయి ఒక గోతంలో పాచిమొక్కలు వేసుకుని ఇంటికి తిరిగివచ్చాడు. ఆ పాచిమొక్కలపైన తనవద్ద ఉన్న ఉన్ని కప్పి, గోతం మూటగట్టి సంతకు బయలుదేరాడు.

ఇలాటి వాడే సోమయ్య అనే వాడొకడు కూడా సంతకు ఒక గోతంతో వచ్చాడు.అతనిది ఇంకొక గ్రామం. అతని గోతంలో మూడు వంతులు సరుగుడుకాయలూ, వాటి పైన పోకకాయలూ ఉన్నాయి.

సంతలోకిఅడుగుపెట్టటానికి రామయ్యకు గుండె చాలలేదు. అందుచేత రామయ్య సంతకుదూరంగా ఒకచెట్టుకింద తనమూటతో సహా కూచున్నాడు. సోమయ్యకూడా అక్కడికే చేరుకున్నాడు. ఇద్దరూ ఒకరినొకరు పలకరించుకున్నారు. నువ్వేం తెచ్చావంటే నువ్వేం తెచ్చావని అడుగుకున్నారు.రామయ్య తన గోతంలోనుంచి ఉన్ని తీసిచూపించి, "భేషైన సరుకు!"అన్నాడు. సోమయ్య తనమూట నుంచి పోకకాయలుతీసి,"చూడు, నిమ్మకాయలంత పోకలు!" అన్నాడు.

"సంత చాలా అడావుడిగా ఉంది. మన బేరంఎవరూలక్ష్యపెట్టరు. మనం మన సరు

25– ఏళ్ళనాటి చందమామ కథ



కులు మారకంవేసుకుంటే ఏం?" అన్నాడు సోమయ్య.

"ఉన్నికి పొకలు మారకమా?" అన్నాడు రామయ్య,లోపలఆశపడుతూనే."పొకలైతేనేం? బంగారమంటిసరుకు. అంతగా అయితే ఒక అర్ధణారొక్కం ఇస్తాలే!" అన్నాడు సోమయ్య.

రామయ్యఅందుకుఒప్పుకున్నాడు. ఇద్దరూ మూటలు మార్చుకున్నారు."వెళ్లివస్తా,"అంటూ సోమయ్య అక్కడినుంచి బయలుదేరాడు.

"నా అర్ధణాఇచ్చివెళ్లు,"అన్నాడురామయ్య.

"బాకీ రాసుకో. తరవాత చెల్లువేస్తా, నేనెక్కడికీ పోనులే. మాది ఫలాని గ్రామం. నా వెంట డబ్బు తేలేదు," అన్నాడు సోమయ్య.

చేసేదిలేక రామయ్యసోమయ్యచేత అర్ధణా బాకీ గురించి ప్రమాణం చేయించుకున్నాడు. ఎవరిళ్ళకు వారు వెళ్ళారు. తాము మోసపోయినట్టు ఇద్దరికీ తెలిసిపోయింది.కనీసం అర్ధణా బాకీ అయినా వసూలు చేసుకుందామని రామయ్య,సోమయ్యఉండేగ్రామానికివెళ్ళాడు.

సోమయ్య ఆఊరి షావుకారిదగ్గర కమతం చేస్తాడు.అతను రామయ్యనుచూస్తూనే,"మొత్తానికి నన్ను ముంచావే!" అన్నాడు కోపంగా.

"నువ్వు నన్ను ముంచలేదా ఏమిటి?" అన్నాడు రామయ్య.

"దానికీ దానికీ చెల్లు!" అన్నాడు సోమయ్య.

"అదంతా వల్లకాదు. నాకు అర్ధణా బాకీ ఉన్నావు. ప్రమాణంకూడాచేశావు. అది చెల్లు వెయ్యి!" అన్నాడు రామయ్య.

"నా దగ్గిర చిల్లిగవ్వ కూడా లేదు. కాని మనమిద్దరమూ లాభం పొందే ఉపాయం ఒకటి చెబుతావిను. మా షావుకారుఇంటివెనక ఒకలోతైన గొయ్యి ఉంది. ఒక సారి షావుకారు ఆ గోతిలో నిచ్చెనవేసి దిగుతుంటే చూశాను. అందులో ఏదో దాచి వుంటాడు. ఇవాళ రాత్రి మనిద్దరంకలిసి ఆ గోతిలో ఏమున్నదీ తెలుసుకుని తీసుకుని పంచుకుందాం. సహాయపడతావా?" అన్నాడు సోమయ్య.

రామయ్య కొంచెంఆలోచించిసరేనన్నాడు. అందులో ఏదన్నా నిధి దొరికితే ఇంతపొలం కొనుక్కుందామని అతనికి ఆశ కలిగింది.

ఆ రాత్రి సోమయ్య ఒక గోతమూ, తాటి మోకూతెచ్చాడు. అర్ధరాత్రివేళ ఇద్దరూ షావుకారుగారి దొడ్లోప్రవేశించారు.రామయ్య మోకు పట్టుకున్నాడు.సోమయ్య గోతంతోసహా మోకు పట్టుకునిగోతిలోకిదిగాడు.అతను ఎంత వెతికినా గోతిలో మట్టి తప్ప ఏమీ కనిపించలేదు.

"ఈ రామయ్య గడుసుముండాకొడుకు. ఏమీ లేదంటే మోకు గోతిలో పారేసి చక్కా

పోతాడేమో! అందుచేత యుక్తిగా పైకి వెళ్ళాలి," అనుకుని సోమయ్య తాను గోతంలో కూచుని గోతాన్ని మోకుకు కట్టి, "ఇదుగో, ఇక్కడ వున్నదంతా గోతంలో కట్టాను. దాన్ని పైకి లాక్కుని, మళ్లీ మోకులోపలికి వేసి నన్ను కూడా లాగు!" అని కేక పెట్టాడు. రామయ్య ఉత్సాహంతో గోతాన్ని పైకిలాగాడు.

"ఈ సోమయ్య నమ్మదగిన మనిషికాదు. వాడికి ఇందులో ఎందుకు భాగం పెట్టాలి? వాణ్ణి ఆ గోతిలో అఘోరించనీ!" అనుకుని రామయ్య, మూట వీపునవేసుకుని తన గ్రామానికి నడవసాగాడు. అందులో సోమయ్యవున్న సంగతి రామయ్యకు తెలియదు.

కొంతదూరం పోయాక మూట బరువనిపించి రామయ్య దాన్ని దించాడు.

వెంటనే సోమయ్య మూట విప్పుకుని బయటికి వచ్చాడు.

"దుర్మార్గుడా, నన్ను మళ్లీ మోసం చేశావా?" అన్నాడు రామయ్య.

"నీ మంచితనం ఏమయింది? నిధిలో నాకు వంతులేకుండా అంతా కాజెయ్యాలని చూడలేదా? దానికీ దీనికీ చెల్లు!" అన్నాడు సోమయ్య.

"అదంతా వల్లకాదు. నాకు అర్ధణాబాకీ ఉన్నావు. ప్రమాణంకూడా చేశావు!" అన్నాడు రామయ్య.

"నేను కాదన్నానా? నా దగ్గిర ఉన్నప్పుడు వసూలుచేసుకో!" అన్నాడు సోమయ్య. ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు.

తరవాత సోమయ్యకు పెళ్లి అయింది. పెళ్ళాం కొంతడబ్బు తెచ్చింది. సోమయ్య కమతం మానేసి, కొంత పొలం కొనుక్కుని,



వ్యవసాయం ప్రారంభించాడు. అది లాభించింది. ఊరి బయట ఇల్లువేశాడు.

రామయ్యమటుకు ఎప్పటిలాగే ఒళ్ళు విరుచుకుని కష్టించి పొట్టపోసుకుంటున్నాడు. ఒకనాడతనికి సోమయ్య బాకీవున్న అర్ధణా జ్ఞాపకం వచ్చింది. అది వసూలు చేసుకోవటానికి సోమయ్య ఉండే గ్రామానికి బయలుదేరాడు రామయ్య.

సోమయ్య తన ఇంటిపంచలో కూచుని ఉండగా రామయ్య వస్తూండటం కనబడింది. వెంటనే అతను లోపలికి వెళ్లి భార్యతో, "ఒసే, బాకీదారు రామయ్య వస్తున్నాడు. నేనుచచ్చిపోయినట్టు పడుకుంటాను. నువ్వు నామీద పడి ఏడుస్తూ ఉండు. సాయంకాలం దాకా ఏడిచావంటే ఈ రామయ్యపీడ శాశ్వతంగా వదిలిపోతుంది," అన్నాడు.



సూర్యాస్తమయయింది. రామయ్య వెళ్లి పోలేదు. ఇరుగు పొరుగు ఇళ్లవాళ్లు వచ్చి, "భోజనంచెయ్యటానికిలేదు. అందుచేత వెంట నేశవాన్నిపాడుపడినగుడిలోకిచేర్చండి," అన్నారు.

"శవజాగారం ఎవరు చేస్తారు? నేను ఈ శవంతో ఒంటిగా ఆ పాడుపడ్డ ఆలయంలో తెల్లవార్లూ ఉండలేను," అన్నది సోమయ్య భార్య.

"అందుకు నేనున్నానుగా. నా దీర్ఘమిత్రుడి శవాన్నిరాత్రల్లా నేనేచూసుకుంటాను," అన్నాడు రామయ్య.

సోమయ్యభార్య రహస్యంగా భర్తతో, "ఇప్పుడేం చెయ్యాలి?" అన్నది.

"గుడికి తీసుకపోనీ. భయం లేదులే!" అన్నాడు సోమయ్య. అతన్ని శవవాహకులు గుడిలో చేర్చి వెళ్లిపోయారు. రామయ్య శవ జాగారం ప్రారంభించాడు.

సోమయ్యభార్య అలాగే చేసింది. రామయ్య వచ్చి అంతా చూశాడు.

"ఇంకా సోమయ్య నీ బాకీ ఏం చెల్లేస్తాడు, నాయనా? సోమయ్యకుఅన్ని రుణాలూ తీరి పోయాయి!" అంటూ సోమయ్య భార్య రాగాలు పెట్టింది.

"అయ్యో, సోమయ్య నాకు దీర్ఘ స్నేహి తుడు. అతనికి ఉత్తరక్రియలుచేయించిమరీ వెళతాను. మేమిద్దరమూకలిసి చేసిన వ్యవ హారాలు బోలెడున్నాయి!" అన్నాడు రామయ్య.

ఆయన ఇంటి బయట నిలబడి, దారి పోయే వాళ్ళద్వారా శవవాహకుల కోసం కబురు చేశాడు. వాళ్లు వచ్చారు.

"నా బంధువులంతా వచ్చినదాకా శవాన్ని శ్మశానానికి తీసుకుపోవటానికి వీల్లేదు!" అన్నది సోమయ్యభార్య.

అర్ధరాత్రిఅయింది. గుడిబయటమనుషుల సందడిఅయింది. రామయ్య చప్పున గర్భ గుడిలోకి వెళ్లి దాక్కున్నాడు. కొద్దిసేపటిలో నలుగురు దొంగలు గుడిలోకివచ్చారు. వాళ్ల నాయకుడు ఒక మూట దించాడు. అందులో నుంచి ఖరీదైననగలూ, డబ్బూ తీసి నాలుగు కుప్పలుగా చేశాడు. ఆ వస్తువులలో ఒకకత్తి కూడా వున్నది.

"దీన్ని ఎవరు తీసుకుంటారు?" అని దొంగలనాయకుడు అడిగాడు. దొంగలుఅది పనికిమాలినకత్తి అన్నారు.

"కాదు! ఇది భేషైన కత్తి. కావలిస్తే ఒక వేటున ఈశవాన్ని రెండుగా తెగేసిచూపుతాను!" అంటూ దొంగలనాయకుడు కత్తి తీసుకుని సోమయ్యను సమీపించాడు.

వెంటనే సోమయ్య లేచినిలబడి, "ఏయ్ భూతాలూ! మీరంతా ఎక్కడ చచ్చారు?" అని అరిచాడు. మంత్రం వేసినట్టుగా దొంగలంతా మాయమయ్యారు. ఈ సంగతి తెలుసుకుని రామయ్య ఇవతలికి వచ్చాడు.

"చూశావా? మన పంట పండింది. ఇదంతా పంచుకుందాంపట్టు!" అన్నాడు సోమయ్య. దొంగలుదోచిన సొమ్మంతా పంచుకోవటం పూర్తి అయింది.

"అంతా బాగానేఉంది నా అర్ధణా మాటేమిటి?" అన్నాడు రామయ్య. ఇద్దరూ తగాదా పడసాగారు.

ఈలోపల దొంగలు చాలాదూరం పారిపోయి ఒకచోట ఆగారు. దొంగలనాయకుడు తన అనుచరులతో, "మనం ఇవాళ చాలా నామర్దాపని చేశాం. మహామహా యోధులకు కూడా భయపడని మనం దడుచుకునిఅంత సొమ్ము వదిలేసివచ్చాం. మనలో గుండెధైర్యం గలవాడెవడైనా వెళ్ళి ఆ గుడిలో ఏం జరుగుతున్నదీ చూసివస్తే బాగుంటుంది!" అన్నాడు.

మిగిలిన ముగ్గురు దొంగలూ వెళ్ల నిరాకరించారు. దొంగలనాయకుడికి తప్పిందికాదు. అతను గుండెలు అరచేత పట్టుకుని పాడుబడిన గుడినిసమీపించి బయటినుంచి ఆలకించసాగాడు. లోపల రామయ్య, సోమయ్యలిద్దరూ గుడి మారుమోగేట్టు అరుస్తున్నారు. "నా అర్ధణా ఏమైనట్టు!" అంటున్నాడు రామయ్య. "నీ అర్ధణా నీకు ముట్టింది ఫో!" అంటున్నాడు సోమయ్య.

ఈ మాటలు వినగానే దొంగలనాయకుడికి ముచ్చెమటలు పోశాయి. అతను మిగిలిన దొంగలవద్దకు వెళ్ళి, "ఓయమ్మో, ఆ గుడిలో ఎన్ని భూతాలున్నాయో మనం ఊహించలేం! మనం దోచిన సొమ్మంతా పంచితే ఒక్కొక్క భూతానికీ అర్ధణా వచ్చింది! అదికూడా అన్ని భూతాలకూ సరిగా అందలేదు! ఇవాళ మనం లేచినవేళ మంచిది! పోదాం పదండి. బతికుంటే బలుసాకు తినవచ్చు!" అన్నాడు. దొంగలు వెళ్ళిపోయారు.

చివరకు రామయ్యా, సోమయ్యా రాజీపడ్డారు. తన అర్ధణా కింద రామయ్యదొంగల కత్తి తీసుకున్నాడు. తరవాత రామయ్య తన వంతు ధనంతో ఇంటికితిరిగి వచ్చి, పొలం కొనుక్కుని, పెళ్ళాడి రైతుజీవితం గడపసాగాడు. సంతకు సరుకులు తోలుకుపోవాలన్న అతనికోరిక ఈడేరింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు **1997** మే నెల సంచికలో ప్రకటింపబడును.



S.G. SESHAGIRI



MAHANTESH C. MORABAD

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * మార్చి నెల **15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దప్పికతీర్చే వ్యాపారం!
రెండవ ఫోటో : దరిచేర్చుకుంది మమకారం!
పంపినవారు : సి. ప్రణీత
C/o, వి. ప్రసాద్, 7/260, యాదవ వీధి,
రంగనాయకులపేట, నెల్లూరు **-524001**(ఆం.ప్ర)


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - **600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026 (India), Controlling Editor: NAGI REDDI.




Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.